# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫొటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.




# బ్రిటానియా
# గోల్డెన్ పఫ్




బ్రిటానియా వారే ప్రత్యేకంగా తయారుచేసే యీ గోల్డెన్ పఫ్ బిస్కట్లు తాజాగా కరకరలాడుతూ వుండి పుష్టినిచ్చును. కాఫీ, టీ, త్రాగేటప్పుడు సేవించుటకు అనువైనవి. జామ్, వెన్న, జున్నుతో కూడ సేవించవచ్చును. రుచి చూడండి — నోట్లో కరిగిపోతాయి. నేడే కొనండి. కమ్మగా రుచిగా వుండే యీ తాజా బ్రిటానియా గోల్డెన్ పఫ్ బిస్కట్లను సేవించి ఆనందించండి.

## బ్రిటానియా బిస్కట్లు





# తుషార్ రుచిగా వుంటుంది,
# మీకు ఆరోగ్యమును చేకూర్చును!



తుషార్‌లో ఎ మరియు డి విటమిన్‌లు గలవు. మీ భోజనమునకు అధిక ఆహార విలువను సమకూర్చును. తుషార్‌తో మీరు వండిన రుచిగల వంటకములు వారిని ఆనంద బరుసూ మీ కుటుంబమును ఆరోగ్యముగా నుంచును.






**తుషార్**-పుష్టికరమైన, రుచిగల భోజనము కొరకు!
తుంగభద్ర ఇండస్ట్రీస్ లిమిటెడ్, కర్నూలు.

ASP/TI-15 Tel

# నేర్చుకొనుటకు పసితనం ప్రతిబంధకంగాదు



మొక్కలకు అవి బ్రతికే నిమిత్తం నీళ్లు కావలెను అని చిన్న బాలురు పసితనమందే నేర్చుకుందురు. ఈ సామాన్యమైన యదార్థమును ఒక్క మాటు నేర్చుకుంటే ఇంకెన్నటికీ మరువరు.

మీ పిల్లలకు మీరు ఇప్పుడు నేర్పవలసిన మరియొక పాఠము. పళ్లు మరియు పనుచిగుళ్ల పట్ల రోజూ శ్రద్ధవహించుట, అందువల్ల భవిష్యత్తునందు కొన్ని సంవత్సరాలలో దంతక్షయం మరియు పనుచిగుళ్ల జబ్బులబారి బడకుండా వారిని కాపాడినందుకు వారు మీకు అభివందనములర్పింతురు. వారి పళ్లను మరియు పనుచిగుళ్లను ఫోర్‌హాన్స్ టూత్ పేస్టుతో తోముకొనుచూ భద్రపరుచుకోమని మీ పిల్లలకు నేడే బోధించండి. దంత వైద్యుని చేత తయారు చేయబడిన ఫోర్‌హాన్స్' పనుచిగుళ్లకు గుణకారియైన డాక్టర్ ఫోర్‌హాన్ యొక్క ప్రత్యేక పదార్థములు గల టూత్ పేస్టు ప్రపంచంలోకెల్ల ఇది ఒక్కటే. రోజూ వాడుచున్నయెడల పళ్లు తెల్లగా మెరయుచూ, పనుచిగుళ్లు గట్టిగాను ఆరోగ్యవంతంగాను వుండును. "CARE OF THE TEETH AND GUMS" అనే చిన్న రంగుల పుస్తకం ఉచిత ప్రతి కోసం తపాలా ఖర్చుల నిమిత్తం 10 న.పై. తపాలా బిళ్లలను పంపండి: మేనర్స్' డెంటల్ అడ్వయిజరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం 10031, బొంబాయి.




**COUPON**

Please send me a copy of the booklet
"CARE OF THE TEETH AND GUMS"

*Name* ______________________

*Address* ______________________

______________________

# ఆమె పరీక్షలో ఫేలయేదే!

ఆమె క్లాసంతకీ ఫస్టుగా వచ్చేది. కాని తరువాత పరీక్షలు దగ్గర పడినప్పుడు ఓపికలేక చదువు వెనక్కు పెట్టింది.

ఆమెను డాక్టరుకు చూపించేము. సరియైన పోషణలేక పిల్లలు కోల్పోయిన శక్తిని మళ్లీ పొందకపోతే యిలాగే అవుతుందని ఆయన చెప్పేరు.






డాక్టరు చెప్పినట్లే ఆమెకు హార్లిక్స్ యిచ్చేము. త్వరలోనే ఆమె మళ్లీ ఓపికతో చదువులో పడింది. ఫస్టుగా ప్యాసయింది కూడా!

పిల్లలు త్వరగా శక్తిని పోగొట్టుకొంటారు. వారికి పోషణ కలిగించే ఆహారము యివ్వకపోతే త్వరలోనే అలసిపోయి శ్రద్ధగా ఉండరు. హార్లిక్స్ అదనపు శక్తిని కలిగిస్తుందని డాక్టర్లకు తెలుసును. అది పూర్తి మీగడగల పాలు, గోధుమపిండి మరియు మాల్టెడ్ బార్లీలతో తయారయింది. శ్రమగా ఉన్న సమయాల్లో హార్లిక్స్ ఎంతో సహాయపడుతుంది.

## హార్లిక్స్

అదనపు శక్తిని కలిగించును!




JWT-HL-3497A

# పిల్లలకు అందమైన బొమ్మల కథల పుస్తకాలు

**ఆలీబాబా 40 మంది దొంగలు** | **అలాఉద్దీన్ అద్భుతదీపం**

కథలు అందరు ఎరిగినవే, అయినప్పటికిన్నీ ఆకర్షవంతమైన రంగురంగుల వాష్ చిత్రాలతో సులభమైన పదాలతో, ముచ్చట గొలిపే ముఖచిత్రాలతో, చిన్నపిల్లలకు అర్థమగు విధంగా క్లుప్తంగా కూర్చబడి—నాణ్యమైన కాగితంమీద అందంగా ముద్రించి తయారు చేయబడుటయే వీని ప్రత్యేకత. ఈ పుస్తకములు చిన్న పిల్లలకు ఎంతగనో ఉపకరిస్తవి. చదువుతూనే అనేక సార్లు బొమ్మలు చూచుటవల్ల కథ చక్కగా అర్థంకావడమే కాక బాగా జ్ఞాపకం ఉంటుంది.

ఇంత చక్కని పుస్తకములు తెలుగు - తమిళం - కన్నడ భాషలలో తయారయినవి.

ఏ భాషలోనైనా ఒక్కొక్క పుస్తకం రూ. 2-25 (పోస్టేజి అదనం)

**హెగ్గిన్‌బాదమ్స్ ప్రైవేటు లిమిటెడ్,**

165, మౌంటురోడ్డు : : మద్రాసు - 2

రెండు గోళీలు, ఒక బొంగరము ఒక గాలిపటం
నా కిస్తే నీకొక ప్యారీ మిఠాయి ఇస్తాను

మేధావంతుడైన చిన్న బేరగాడు! రుచికరము పుష్టికరము అగు ప్యారీ మిఠాయిలు వృద్ధులకు యువకులకు అభిమానమైనవి. ఎక్కడున్నానరే ఏం చేస్తున్నానరే మీరు ప్యారీ మిఠాయిలను అభిలషించక మానరు. చిల్లరగానో లేక అందంగా అచ్చువేయబడిన డబ్బాగానో కొనండి - పంచుకోండి - ప్యారీ మిఠాయిలతో జీవిత మొక ఆటగా సాగిపోతుంది.




విశిష్టరకపు
మిఠాయిలను
తయారుచేయువారు

వీటిని ఉపయోగించారా : మిల్క్ టాఫీ — సూపర్ బటర్ స్కాచ్ —
ల్యాక్టో బాన్ బాన్స్ — జింజెర్ క్యాన్స్

ప్యారీస్ కన్ ఫెక్షనరీ లిమిటెడ్ మద్రాసు

JWT-PRS-3353

# ఎవ్రేడి
## దిలీప్ బృందం ప్రమాదంనుండి కాపాడారు























**మైకో** - పరిమళమల్లిక, రోస్ బత్తీలు అపూర్వమైన పరిమళము గలవి.

**మైకో** - లక్ష్మిపూజస్, రాజేంద్ర కస్తూరి, పర్షియన్‌గులాబ్, బెడ్‌రూం బత్తీలు. అందమైన తగర డబ్బాలలో దొరకును. అన్ని శుభకార్యములలోను దైవారాధనకు చాల శ్రేష్ఠమయినవి. మధురమనోహర పరిమళము గలవి.




పరిమళ ద్రవ్యములయందు విశేష అనుభవము గల

**విజయా కెమికల్స్**

మదరాసు - 7, వారి తయారీ

---

**అన్నివంటలకు శ్రేష్ఠమైన**

# నూనెలు




అగ్‌మార్కు కాబడిన ఎ.యస్. బ్రాండ్

**చాయపప్పు నూనె**




అగ్‌మార్కు కాబడిన మేన్షన్ బ్రాండ్......

**నువ్వులనూనె**

- గోదావరిడెల్టా నువ్వులనుండి ఆరోగ్యకరమగు ప్రత్యేకపద్ధతులతో తయారు కాబడినవి.
- రుచి,రంగు,సువాసనలతో అన్నివంటుపదార్థములను అమితముగ రుచివంతముగ చేయును.
- ఊరగాయలను చాలకాలము నిలువయుంచును. ముక్కను మెత్తబడనీయదు, బూజుపట్టనీయదు.
- తలకు వాడినయెడల మెదడుకు చలువ చేయును. వెంట్రుకలను బాగుగా పెరుగునట్లు చేయును.
- 16,4,2. కి.గ్రా. డబ్బాలలో పేకింగు చేయబడుచున్నవి.

డిపోలు :

శ్రీ G. సుబ్బారావు,
డాక్టరు వుల్లక్కి స్ట్రీటు, తెనాలి

శ్రీ B. గోపాలకృష్ణమూర్తి,
1-3-166, రాజా ముదలియార్ స్ట్రీటు,
తలాగిగుడ, సికింద్రాబాద్

శ్రీ N. సత్యనారాయణ,
129/L5, రోడ్ నెం. 11,
B. H. ఏరియా, కద్మా, జంషెడ్‌పూరు

MFRS, అంబటి సుబ్బన్న & కో. సామర్లకోట



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

మళ్ళీ చందమామ పెద్దగా పత్రికల కెక్కాడు. జనవరి 31 న రష్యావారు లూన—9 అనే అంతరిక్ష నౌకను పరికరాలతో సహా చంద్రుడి మీదికి పంపారు. అది చక్కగా వెళ్ళి చంద్రుడి మీద వాలి, ఫోటోలు తీసి, రేడియో సంకేతాల ద్వారా చంద్రుడి మీద' ఉండే దృశ్యాలను భూమికి అందజేసింది. ఈ ఫోటోలను ప్రపంచ పత్రికలన్నీ ప్రచురించాయి. లోగడ చంద్రుడి పైకి ప్రయోగించిన అంతరిక్ష నౌకలన్నీ చంద్రమండలం మీద పడి ధ్వంసమైపోయాయి. ఇప్పుడు రష్యావారు అంతరిక్షనౌకలను చంద్రమండలం మీద నిరపాయంగా వాలేటట్టు చేసే కిటుకు తెలుసుకున్నారు. ఇక మనిషి వెళ్ళి చంద్రుడి పైన వాలటమే తరువాయి! అటు పైన చంద్రమండలం గురించి మనకు అనేక విషయాలు తెలుస్తాయి.

సంపుటి: 38 - మార్చి 1966 - సంచిక: 3





# భారత చరిత్ర




శివాజీ తల్లి దేవగిరిని ఏలిన యాదవరాజ వంశానికి చెందినది, తండ్రి ధైర్యసాహసాలకు పేరుమోసిన మేవారు సిసోదియా సంతతివాడు. సాధారణ మరాఠీ సైనికుడైన శివాజీలో స్వతంత్రరాజ్య స్థాపనకాంక్ష కలిగించే ఆవేశం రెండు పక్షాల నుంచీ సంక్రమించింది. అయితే అది దుస్సాహసంతో కూడిన కోరికే. కాని సాహసం ఫలిస్తే ఊహాతీతమైన లాభాలున్నాయి.

మహారాష్ట్రుల విజృంభణకు దక్కను సల్తనతుల శక్తి తరిగిపోతూ ఉండటమూ, ఢిల్లీ వారికి ఉత్తర దేశంలోనే ప్రతిఘటనలు జాస్తిగా ఉంటూండటమూ దోహదమయింది. శివాజీ 1646 లో తోరణదుర్గం పట్టుకుని, త్వరలోనే రాజగఢదుర్గాన్ని తోరణకు అయిదు మైళ్ళు తూర్పున నిర్మించాడు. దాదాజీ ఖోండదేవ్ ఈ చర్యలను హర్షించినట్టు కనబడదు. 1647లో దాదాజీ ఖోండదేవు మరణించిన మీదట శివాజీకి మరింత స్వేచ్ఛ లభించింది. అతను ఇంకా అనేక దుర్గాలను సంపాదించాడు. వాటిలో కొన్ని బిజాపూరు సంస్థానం తాలూకు స్థానికాధికారులవి, మరి కొన్ని ఇతరులవి. ఈ దుర్గాలను సంపాదించటానికి శివాజీ బలప్రయోగమూ, లంచాలూ, కుయుక్తులూ కూడా అవలంబించాడు. ఇలా సంపాదించిన దుర్గాలు కాక, కొన్ని కొత్త దుర్గాలను కూడా అతను నిర్మించాడు. ఈ విధంగా అతను పెద్ద భూభాగం ఆక్రమించుకుని, దానికి అనేక కొండదుర్గాలను రక్షణగా ఏర్పాటు చేసుకున్నాడు.

శివాజీ చర్యలకుగాను బిజాపూరు సంస్థానం వారు తమ కొలువులో ఉన్న అతని తండ్రిని నిర్బంధంలో ఉంచి, శివాజీ తన దౌష్ట్యాన్ని మానితేనే విడుదల చేస్తామన్నారు. ఆ కారణంగా శివాజీ 1649-56

## 54. శివాజీ విజృంభణ

మధ్యకాలంలో బిజాపూరు సుల్తానులపై ధ్వజమెత్తటం మానుకున్నాడు. అయితే ఈ కాలాన్ని అతను వ్యర్థంగా పోనివ్వక తాను గెలిచిన ప్రాంతాలను బలపరుచుకున్నాడు. జావళీ అనే చిన్న, అర్ధ స్వతంత్ర మరాఠీదేశం చంద్రరావుమోరే పరిపాలనలో ఉండేది; శివాజీ చంద్రరావుమోరేను తన మనుషుల చేత చంపించి, 1656 జనవరిలో జావళీని వశపరుచుకున్నాడు. అప్పటికి శివాజీ రాబడి రెట్టింపుకు పైగా పెరిగింది.

1657 లో శివాజీకి మొగలులతో మొట్టమొదటి సంఘర్షణ ఏర్పడింది. ఆ సమయంలో ఔరంగజేబు తన సేనలతో బిజాపూరును ముట్టడించటం చూసి, శివాజీ మొగలు పాలనలో ఉన్న అహమ్మద్‌నగరు, జున్నర్ల పైన దాడిచేసి జున్నర్‌నగరాన్ని కొల్లగొట్టాడు. వెంటనే ఔరంగజేబు ఆ ప్రాంతాలకు బలాలను పంపి శివాజీని ఓడించాడు. ఆదిల్‌షా ఔరంగజేబుతో సంధి చేసుకున్నప్పుడే శివాజీ కూడా సంధి చేసుకున్నాడు. ఔరంగజేబు శివాజీని ఎంతమాత్రమూ నమ్మలేదు. అయితే తన తండ్రికి చాలా జబ్బుగా ఉండి తాను ఉత్తర దేశానికి వెంటనే వెళ్ళిపోవలసి



ఉండటం చేత ఔరంగజేబు ఏదో ఒక విధమైన సంధికి ఒప్పుకున్నాడు.

తరవాత శివాజీ తన సేనలతో ఉత్తర కొంకణం మీదపడి, కల్యాణ్, భివండీ, మాహులీలను పట్టుకుని దక్షిణాన మాహాడ్ దాకా వెళ్ళాడు.

బిజాపూర్ సుల్తానుకు ప్రస్తుతానికి మొగలుల బెడదలేదు, అందుచేత అతను శివాజీని నిశ్శేషంగా నిర్మూలించటానికి నిశ్చయించి, 1659 ఆరంభంలో అఫ్జల్‌ఖాన్ అనే ప్రసిద్ధసేనాని కింద పెద్ద సేనను పంపుతూ శివాజీనిగాని, శివాజీ శవాన్నిగాని తీసుకురావలిసిందిగా ఆదేశించాడు.



ఒక పక్షంరోజులలో అఫ్జల్‌ఖాన్ సాతారాకు ఉత్తరంగా 20 మైళ్ళలో ఉన్న వాయీ అనే చోటికి చేరాడు. ప్రతాపగఢ దుర్గం నుంచి శివాజీని బయటికి రప్పించటం అతనికి సాధ్యంకాలేదు. అందుచేత అతను తనతో సంప్రతింపులకు రమ్మని శివాజీని ఆహ్వానించటానికి కృష్ణాజీభాస్కర్ అనే ఒక బ్రాహ్మణుణ్ణి పంపాడు. కృష్ణాజీకి గౌరవ మర్యాదలు చూపి శివాజీ, అఫ్జల్‌ఖాన్ అసలు ఆలోచన ఏమిటని అడిగాడు. బిజాపూరుసేనాని దురుద్దేశంతో ఉన్నట్టు కనబడుతుందని కృష్ణాజీభాస్కర్ అన్నాడు. అఫ్జల్ వద్దకు శివాజీ దూతగా వెళ్ళివచ్చిన గోపీనాథు డనేవాడు కూడా ఈ మాటే అని ఉండటం చేత శివాజీ జాగ్రత్తపడ్డాడు. అతడు తన దుస్తుల అడుగున కవచం ధరించి, పైకి నిరాయుధుడులాగే కనబడినా రహస్య ఆయుధాలు ధరించి అఫ్జల్‌ను కలుసుకోవటానికి బయలుదేరాడు.

అఫ్జల్ చాలా ఒడ్డూ పొడుగూ గల మనిషి, శివాజీ చాలా పొట్టివాడు. ఇద్దరూ ఆలింగనం చేసుకునే క్షణంలోనే అఫ్జల్ తన ఎడమచేత్తో శివాజీ కంఠాన్ని బలంగా బిగించిపట్టి, కుడిచేత్తో శివాజీని కత్తితో పొడవ యత్నించాడట. కవచం శివాజీని కాపాడింది. మరుక్షణమే శివాజీ తన చేతులకు ఉక్కుగోళ్ళు గల తొడుగులు తగిలించుకుని, వాటి సహాయంతో, అఫ్జల్‌ను చీల్చి చంపేశాడు.

ఆ ప్రాంతాలనే మాటువేసి ఉన్న శివాజీ సైనికులు నాయకుడులేని బిజాపూర్ సైనికులను ఓడించి, వాళ్ళ శిబిరాన్ని కొల్లగొట్టారు.

అఫ్జల్‌ను చంపటంలో శివాజీ ద్రోహం చేసినట్టు కొందరు చరిత్రకారులు రాశారు గాని, ద్రోహం తలపెట్టినవాడు అఫ్జలే నని మరాఠీ చరిత్రకారు లన్నది నిజంగా కనబడుతుంది.



# నేహ్రూ కథ

## 21



కొకినాడ కాంగ్రెసు సమావేశం 1923 డిసెంబరులో జరిగింది. దానికి అధ్యక్షుడు మౌలానామహమ్మదలీ. ఆయన జవాహరును కార్యదర్శిగా ఉండమని నిర్బంధించాడు. భవిష్యత్కార్యక్రమం నిర్ణయం కాని పరిస్థితిలో అలాటి పదవి నిర్వహించటం ఇష్టం లేకపోయినా, మహమ్మదలీని కాదనలేక జవాహరు సమ్మతించాడు.

వా రిద్దరి మధ్యా పరస్పరాభిమానం చాలా ఉండేది, కాని చిన్నచిన్న విభేదాలు కూడా ఉండేవి. ప్రత్యేకించి మతం విషయంలో ఇద్దరూ చాలా వ్యతిరేకంగా ఉండేవాళ్ళు. మహమ్మదలీ అమితమైన మతాభిమానం గలవాడు, జవాహరుకు మతంలో నమ్మకమే లేదు. మౌలానామహమ్మదలీ మతం గురించి ఎత్తినప్పుడల్లా జవాహరు మాట మార్చేవాడు.

ఆ ఏడాది గడిచాక ఆయన కాంగ్రెసు రాజకీయాలలో ప్రముఖ పాత్ర నిర్వహించలేదు. 1930లో ఆయన కాంగ్రెసు తీర్మానాన్ని ఉల్లంఘించి, లండనులో జరిగిన రౌండుటేబిలు సమావేశానికి వెళ్ళాడు కూడా. జవాహరు ఆయనను 1929 కాంగ్రెసు సమావేశ మప్పుడు లాహోరులో ఆఖరుసారి చూశాడు. జవాహరు ఇచ్చిన అధ్యక్షోపన్యాసాన్ని మహమ్మదలీ నిశితంగా విమర్శించి, "ఇదే చెబుతున్నాను, జవాహర్! నీ అనుచరులు నిన్ను జారవిడుస్తారు. వాళ్ళే నిన్ను ఉరికంబం ఎక్కిస్తారు చూస్తూ ఉండు," అన్నాడు. ఆయన మరణ వార్త నైనీ జైలులో ఉండగా తెలిసి జవాహర్ చాలా బాధపడ్డాడు.

కాకినాడ కాంగ్రెసు ముగిసిన అనంతరమే, 1924 జనవరిలో ప్రయాగ (అలహాబాదు) లో కుంభమేళం జరిగింది. ఆ పర్వ



దినాన అనేక లక్షల యాత్రికులు వచ్చి త్రివేణీ సంగమంలో స్నానాలు చేస్తారు. ఆ యేడు గంగా ప్రవాహం తీవ్రంగా ఉండటం చేత అధికారులు త్రివేణిలో స్నానాలను నిషేధించారు. ఈ నిషేధం ప్రజా క్షేమాన్ని కోరి చేసినదే అయినా అనవసరమైనదని జవాహరు భావించాడు. ఎందుకంటే, స్నానాల ఘట్టాలలో కొన్ని రక్షణలు కల్పించి, తడవకు కొంతమంది స్నానాలు చేసే ఏర్పాటు చేసినట్టయితే నిషేధించే అవసరం ఉండేది కాదు.

ఈ నిషేధం గురించి పండిత మదన మోహనమాలవీయకూ, స్థానికాధికారులకూ



ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా కొంత ఘర్షణ జరిగింది. తాను త్రివేణీసంగమంలో స్నానం చెయ్యటానికి అనుమతి కోరుతూ మాలవీయ జిల్లా మేస్ట్రీటుకు రాశాడు, మేస్ట్రీటు అనుమతి నిరాకరించాడు. మాలవీయ మరి రెండువందల మందితో సహా సత్యాగ్రహం చేస్తానని త్రివేణికి బయలుదేరి వచ్చాడు. స్నానం చెయ్యటానికి కాక పోయినా జనాన్ని చూడటానికి వచ్చిన జవాహరు ఈ సత్యాగ్రహంలో చిక్కుకున్నాడు.

త్రివేణికి వెళ్ళే దారికి పెద్ద కంచె అడ్డం కట్టారు. దాని వద్ద అశ్వికభటులను పెట్టారు. సత్యాగ్రహులు కంచె దాకా వచ్చాక పోలీసులు వారిని ఆపేశారు. సత్యాగ్రహులు కంచె వద్ద ఇసుకలో చతికిలబడ్డారు. గంటలు గడుస్తున్నాయి. సూర్యుడు పైకి వస్తున్నాడు. పైన ఎండా, కింద ఇసుకా వేడెక్కుతున్నాయి. సత్యాగ్రహుల కడుపుల్లో జఠరాగ్ని దహించేస్తున్నది. చాలా మంది సత్యాగ్రహులకు విసుగు పుట్టుకొచ్చింది. జవాహరు తన సమీపంలో ఉన్నవాళ్ళతో, "ఎంతసేపీ కూర్చోవటం? కంచె ఎక్కి అవతలికి పోదాం," అన్నాడు.

అనేకమంది జవాహరుతో బాటు లేచారు. జవాహరు కంచె ఎక్కాడు. ఎవరో అతని





కొక జాతీయ పతాక అందించారు. దాన్ని అతను కంచె పైన నిలబెట్టాడు. మరి కొందరు కంచెలో కొన్ని కర్రలూడ లాగి సందు చేశారు. పోలీసులు వారిని నిరోధించ టానికి యత్నించారు. కంచె పైన ఎక్కిన జవాహరు కింద జరిగే దంతా వినోదం చూడసాగాడు.

అశ్వీక పోలీసులు ఎవరినీ హింసించ లేదు, తమ చేతిలోని కర్రలతో జనాన్ని వెనక్కు తోశారు. చివరకు జవాహరు అవ తలి పక్కకు దిగి, చల్లగా గంగలో స్నానం చేసి, తిరిగి వచ్చే సరికి, మాలవీయ మొద లైన వా రింకా అక్కడే కూర్చుని ఉన్నారు. సత్యాగ్రహులకూ కంచెకూ మధ్య అశ్వీక పోలీసులూ, మామూలు పోలీసులూ గోడ లాగా నిలబడి ఉన్నారు. జవాహరు మాల వీయ పక్కనే కూర్చున్నాడు. కొంచెం సేపు గడిచాక మాలవీయ, ఎవరితోనూ మాట మాత్రమైనా చెప్పకుండా, ఒక్క దూకున పోలీసులకూ, గుర్రాలకూ మధ్యగా దూరి అవతలికి వెళ్ళిపోయాడు. మామూలు మనిషి అలాటి పని చేస్తే ఎంతో అశ్చర్యం కలిగిస్తుంది; మాలవీయ వంటి వృద్ధుడూ, దుర్బలుడూ, అలా చెయ్యటం జవాహరుకు అత్యాశ్చర్యాన్ని కలిగించింది.



మాలవీయ వెనకగా మిగిలినవారు కూడా వెళ్ళారు. వారిని ఆపటానికి పోలీ సులు దీక్షగా ప్రయత్నించలేదు. కొద్ది సేప టికి పోలీసులు వెళ్ళిపోయారు. తరవాత కూడా ప్రభుత్వం ఈ సంఘటనను ఇంతతో పోనిచ్చింది.

1924 ప్రారంభంలో గాంధీజీకి ప్రమాద కరమైన జబ్బు చేసింది. ఆయనను జైలు నుంచి ఆస్పత్రికి చేర్చారు. ఆయన వ్యాధి తిరుగుముఖం పట్టిన దాకా దేశం ఆందో ళనలో మునిగిపోయింది. ఆయన ఆస్పత్రిలో కూడా ఖైదీగానే ఉన్నాడు. అయితే కొద్దిమంది మిత్రులను చూడటానికి



మాత్రం ఆయనకు అవకాశం లభించింది. జవాహర్ తన తండ్రితో సహా గాంధీజీని పూనాలోని ఆస్పత్రిలో చూశాడు.

వ్యాధి నయమయాక గాంధీజీని ప్రభుత్వం తిరిగి జైలుకు పంపక విడుదల చేసింది. ఆయన బొంబాయి సమీపంలోని జుహూ తీరంలో కోలుకోసాగాడు. నెహ్రూలు కూడా అక్కడే ఒక కుటీరం తీసుకుని కొద్ది వారాలపాటు ఉండిపోయారు.

జవాహరు కది ఆటవిడుపు. అతను సముద్రంలో ఈతలుకొట్టాడు. తీరాన పరుగులు తీశాడు. మోతీలాలు ఉద్దేశం, గాంధీజీకి స్వరాజిస్టుల దృక్పథం వివరించి, ఆయనను కొంతవరకైనా ఆ దృక్పథానికి సముఖుణ్ణి చేసుకోవాలని. జవాహరు ఉద్దేశం గాంధీజీ భావికార్యక్రమం తెలుసుకోవాలని. ఇద్దరి ఆశయాలూ కొనసాగలేదు.

గాంధీజీ స్వరాజిస్టుల విషయంలో ఏమాత్రమూ రాజీ పడలేదు. ఉభయ పక్షాలూ ఎంతో సౌజన్యంతో, ఎంతో మర్యాదగా తమతమ భిన్న దృక్పథాలకు అంటి పెట్టుకున్నారు. జవాహరు అనుమానాలలో ఏ ఒక్కటీ తీరలేదు. ఎందుకంటే, గాంధీజీకి భవిష్యత్తు గురించి ముందాలోచనా, దీర్ఘకాలిక పథకాలూ అలవాటులేదు. ప్రస్తుతానికి ప్రజాసేవ కొనసాగిస్తూ కార్యాచరణకు తగిన సమయం ఆసన్నమయే దాకా వేచి ఉండమని జవాహరుకు గాంధీజీ సలహా ఇచ్చాడు. అంతేకాదు, గమ్యం గురించి కూడా ఆయనకు స్పష్టమైన అభిప్రాయం లేదు. జవాహరును బాధించిన దేమంటే, కొంతమంది కాంగ్రెసు వాదులు సంపూర్ణ స్వాతంత్ర్యం కాంగ్రెసు లక్ష్యమని చెబుతుంటే, మరి కొందరు—సప్రూ లాటి వారు—బ్రిటిషు సామ్రాజ్య వైభవాన్ని తెగ పొగడనారంభించారు. మితవాద నాయకులకూ, జవాహరు లాటి వారికీ మధ్య పెద్ద అఖాతం ఏర్పడింది.





# నవాబు నందిని

## 8

జగతసింహుణ్ణి చెర విడిపించటానికై విజ్ఞాపన పత్రం తీసుకుని అభిరామస్వామి మరి అయిదుగురితో సహా ఢిల్లీకి బయలుదేరాడు. ఆరుగురూ గుర్రాల పైనే ప్రయాణించారు. విజ్ఞాపన సఫలం కావాలంటే చాలా ధనం ధారపోయవలసి ఉంది. అందుచేత ఆయుషా అభిరామస్వామికి అనేక రత్నాలూ, బోలెడంత డబ్బూ ఇచ్చి పంపింది. అంతే గాక అభిరామస్వామి పని తేలిక కాగలందులకు, ఢిల్లీ అంతఃపురం లోనూ, దర్బారు లోనూ తాను పూర్వం ఎరిగిఉన్న వారికి ఉత్తరాలు రాసింది, మానసింహుడి చెల్లెలైన బేగముకు స్వయంగా ఒక విజ్ఞాపన పత్రం కూడా రాసింది. ఈ ఉత్తరాలన్నీ చేరవలిసిన వారికి చేరితే పని జరిగిపోవటానికేమీ సందేహం లేదు. ఆ విషయంలో ఆయుషా కొంచమైనా లోపం చెయ్యలేదు.

ముందు అబిరామస్వామిని ఢిల్లీ చేరి కొంత యత్నం చెయ్యనిచ్చి, వెనకగా తాను కూడా అక్కడికి వెళ్ళాలని ఆయుషా అనుకున్నది. కాని ఆమె మానసింహుడి అంతఃపురంలో బందీ కావటంతో ఆ పనికి ఆటంకం కలిగింది. అయినా ఆమె విచారించ లేదు. ఏమంటే బందీ కాక పూర్వమే ప్రయత్నం సఫలం కావటానికి అవసరమైన ఏర్పాట్లన్నిటినీ ఆమె చేసేసింది.

ఢిల్లీకి బయలుదేరిన అయిదో రోజున అభిరామస్వామి, తన అనుచరులతో

దామోదర ముఖర్జీ



కాన్పూరు చేరుకున్నాడు. అక్బరుపాదుషా ఢిల్లీలో లేడనీ, ఆగ్రాకు వచ్చి ఉన్నాడనీ ఆయనకు కాన్పూరులో తెలిసింది. ఇది ఆయనకు శుభశకునంగా కనబడింది. ఎందుచేతనంటే, కాన్పూరు నుంచి ఆగ్రాకు రెండు రోజులలోనే చేరిపోవచ్చు.

ఆరుగురు ప్రయాణీకులు మధ్యాహ్నం వేళ దాటి కాన్పూరు చేరి, అంగడి వీధికి సమీపంలో ఉన్న పెద్ద మర్రిచెట్ల కింద దిగారు. గుర్రాలు అలిసి ఉన్నాయి. అభిరామస్వామి ఒక మర్రిచెట్టు కిందా, మిగిలిన అయిదుగురూ గుర్రాలతో సహా మరొక మర్రిచెట్టు కిందా మజిలీ చేశారు.

అభిరామస్వామి తన వీపున వేళ్ళాడే చర్మాన్ని నేల పైన పరిచి, తన రొమ్ముకు కట్టుకుని ఉన్న మూటను దాని కింద తలగడగా ఉంచి పడుకున్నాడు. ఆ మూటలో జగతసింహుడి విజ్ఞాపన పత్రమూ, ఆయుషా ఇచ్చిన రత్నాలూ, ఉత్తరాలూ మొదలైనవన్నీ ఉన్నాయి.

మిగిలిన అయిదుగురూ గుర్రాలకు మేత తేపటమూ, వంటచెయ్యటమూ మొదలైన ప్రయత్నాలలో నిమగ్నులయ్యారు. ఆ అయిదుగురూ ఒకే వంటలో భోజనం చేసేవారు. "తమ కేం చెయ్యమన్నారు?" అని వాళ్ళు అభిరామస్వామి నడిగారు. "నాకు వేరే ఏమీ వద్దు. ఇంత పిండిలో చక్కెర కలిపి తీసుకుంటాను," అన్నా డాయన.

వాళ్ళు వంట ప్రారంభించే సరికి సాయంకాలమయింది. వంట అయే లోపుగా దీపసామగ్రి తెచ్చి దీపాలు కూడా వెలిగించుకున్నారు. రాత్రి ఎనిమిదిగంటల వేళ వాళ్ళు భోజనాలకు కూర్చోబోతూండగా అంగడి వీధిలో ఇళ్ళు అంటుకున్నాయి. పెద్ద కోలాహలం బయలుదేరింది. తన వెంట వచ్చిన వారితో అభిరామస్వామి, "చూస్తూ ఉండిపోకండి. వెళ్ళి ఇళ్ళు తగలబడేవాళ్ళకు సహాయపడండి," అన్నాడు.



వాళ్ళు భోజనం చేసే ప్రయత్నం మానుకుని మంట లార్పటానికి వెళ్ళారు. ఇంతలో సమీపంలోనే ఎవరో స్త్రీ, "అయ్యో, నా బిడ్డ! రక్షించండి! రక్షించండి!" అని ఏడవసాగింది. అభిరామస్వామి అటుగా పరిగెత్తిపోయి, కాలిపోతున్న ఒక ఇంటి నుంచి ఒక బిడ్డను బయటికి తీసుకువచ్చి, ఆ బిడ్డను దుర్మరణం నుంచి కాపాడి తల్లికి ఇచ్చేశాడు.

మంటలు అదుపులోకి వచ్చేసరికి రాత్రి పన్నెండయింది. అభిరామస్వామి మనుషులు తమ చోటికి తిరిగి వచ్చారు. అభిరామస్వామి కూడా వారితోనే వచ్చేశాడు. వాళ్ళు తిరిగి వచ్చేసరికి ఒక్క గుర్రం లేదు, ఒక్క వంటకం కూడా లేదు, ఒక్క చెంబు గాని, పాత్ర గాని లేదు. అభిరామస్వామి చర్మం కింద దాచుకున్న మూట కూడా పోయింది. అభిరామస్వామి నిశ్చేష్టుడై కూలబడిపోయాడు. ఇలా అవుతుందని ఆయన ఎన్నడూ అనుకోలేదు. ఎంతో కాలంగా చేసిన ప్రయత్నాలన్నీ కలలాగా కరిగి మాయమైపోయాయి.

ఆ ఆరుగురూ మిగిలిన రాత్రి మర్రి చెట్ల కిందనే గడిపి, తెల్లవారగానే కొత్వాలు దగ్గిరికి వెళ్ళారు. ఆ కొత్వాలు ప్రచండుడు. అతని కచేరీ పాదుషాల దర్బారు కన్న



కూడా భయంకరమైనది. ఈ కొత్వాలు ఎదురుగా కనిపించిన వాణ్ణి, కారణం ఉన్నా లేకపోయినా, దండించే రకం. అభిరామస్వామి ఒకవంక తమ సొత్తు చోరీ అయిపోయిన విషయం చెబుతూంటే అంతా విని కొత్వాలు, "వీళ్ళు దొంగల్లా గున్నారు. ఈ సన్యాసి వేషం వేసినవాడు ఆరితేరిన చోరుడు. వీళ్ళెక్కడి నుంచో దొంగతనాలు చెయ్యటానికి వచ్చి, తాము మంచి వాళ్ళమని నే ననుకోగలందులకు ముందుగానే దొంగతనం జరిగిందంటూ నా దగ్గిరికి వచ్చారు. ముందు వీళ్ళను ఖైదులో పెట్టండి," అని సేవకుల నాజ్ఞాపించాడు.

అభిరామస్వామి పెద్ద చిక్కులో పడిపోయాడు. ఖైదు చీకటి గానూ, దుర్గంధంతో కూడుకునీ ఉన్నది. వారిని కాజీ ఎదట విచారిస్తారు. కొత్వాలే అనుకుంటే కాజీ అతన్ని మించినవాడని తెలిసింది. అయన తమకు జైలు శిక్ష వెయ్యటం ఖాయ మనుకుని వాళ్ళు ఖైదు నుంచి తప్పించుకుపోవటానికి నిశ్చయించుకున్నారు. కిందటి రోజల్లా వారికి తిండి లేదు, ఈ రోజు కూడా లేదు. అందరూ నీరసించి ఉన్నారు. అయినప్పటికీ ఆ అర్ధరాత్రి వేళ, ఎత్తున ఉన్న కిటికీ కమ్ము లూడగొట్టి, ఆ రంధ్రం నుంచి ఒక్కరొక్కరుగా బయటపడ్డారు.

తెల్లవారే లోపునే ఆ అరుగులూ రెండు ముఠాలుగా చీలారు. అభిరామస్వామి వెంట వచ్చిన వారిలో ముగ్గురు పాట్నాకు తిరిగి వెళ్ళిపోయి, తాజ్‌ఖాన్ ఇంటికి వెళ్ళి, నవాబునందినికి జరిగిన దంతా చెప్పేటట్టూ, అభిరామస్వామి మిగిలిన ఇద్దరు అనుచరులతో ముందుకుసాగి ఆగ్రాకు వెళ్ళేటట్టూ నిశ్చయమయింది.

పాట్నా చేరుకున్న ముగ్గురు మనుషులూ తమ పని నెరవేర్చలేకపోయారు. ఎందుచేతనంటే, తాజ్‌ఖాన్ ఇంట నవాబునందిని ఆయుషా లేదు; ఆమె మానసింహుడి ఇంట

బందీగా ఉన్నది. ఆమెను గాని, కారాగృహంలో ఉన్న జగతసింహుణ్ణి గాని చూడటం వారికి అసాధ్యమయింది.

ఆగ్రా కేసి అరణ్యమార్గాన బయలుదేరిన అభిరామస్వామీ, అతని అనుచరులిద్దరూ దారిలో అడవిపళ్ళూ అవీ తిని, నదిలో నీరు తాగి ఆకలిదప్పు లణచుకున్నారు; రాత్రి వేళ చెట్ల మీద కొమ్మలకు తమనుతాము బంధించుకుని కునుకు తీశారు. ఈ విధంగా రెండు రోజులు ప్రయాణించి మూడోనాటి ఉదయం ఆగ్రా సమీపంలో యమునా నదికి ఉత్తరంగా ఉండే అరణ్యం చేరుకున్నారు.

అక్కడి దారి వెంట పోతూండగా అభిరామస్వామి దారిలో కొత్తగా పడిన గుర్రపు డెక్కల గుర్తులు చూశాడు. ముగ్గురూ వాటి వెంబడి కొంత దూరం ముందుకు వెళ్ళేసరికి ఆ గుర్తులు దక్షిణంగా మళ్ళి, ఇంకొక మార్గం పట్టాయి. అవి అలా కొంత దూరం వెళ్ళి మరొక అరణ్యంలో మాయమయాయి. అభిరామస్వామి తన వెంట ఉన్న వారిలో ఒకణ్ణి పిలిచి, "కొంచెం అరణ్యంలోకి వెళ్ళి, ఏమైనా కనిపిస్తుందేమో చూసి రాగలవా?" అన్నాడు.

ఆ మనిషి అలికిడి కాకుండా వెళ్ళి తిరిగి వచ్చి, "దగ్గరలోనే మన ఆరు





గుర్రాలూ, పోయిన మన వస్తువులూ ఉన్నాయి. వాటి వెంట పదిమంది మనుషులున్నారు," అని చెప్పాడు. వాళ్ళే దొంగతనం చేసినవాళ్ళని తేలిపోయింది.

"నే నాగ్రాకు వెళ్ళి సిపాయిలను తీసుకు వస్తాను. మీ రిద్దరూ ఇక్కడే ఉండి దొంగలను ఒక కంట కనిపెట్టి ఉండండి. నేను వచ్చే లోగా వాళ్ళు ఈ స్థలం విడిచి మరొక చోటికి వెళితే, మీలో ఒకడు వారి వెనక జాగ్రత్తగా వెళ్ళి, వాళ్ళు కొత్త మకాం ఎక్కడ పెట్టినదీ తెలుసుకురావాలి," అని తన మనుషులను హెచ్చరించి అభిరామస్వామి ఆగ్రాకు బయలుదేరాడు. ఆయన



ఆ సాయంకాలం తిరిగి రాగలుగుతా ననుకున్నాడు, కాని ఆయన మర్నాడు ఉదయానికి గాని కొత్వాలునూ, సిపాయిలనూ వెంటబెట్టుకుని తన అనుచరుల వద్దకు రాలేకపోయాడు.

వాళ్ళు వచ్చేదాకా దొంగ లక్కడే ఉన్నారు. వాళ్ళు తేలికగా పట్టుబడ్డారు. అభిరామస్వామి బృందం పోగొట్టుకున్న వస్తువులన్నీ వాళ్ళ వద్ద దొరికాయి. కాని అవి వెంటనే అభిరామస్వామి చేతికి అందలేదు. కొత్వాలు స్వాధీనపరుచుకున్నాడు. దొంగలను కాజీ విచారణ చెయ్యాలి, అభిరామస్వామి మొదలైన వాళ్ళు తమ వస్తువుల అనవాళ్ళు చెప్పి, అవి తమవేనని రుజువు చెయ్యాలి; అంత దాకా అవి వారికి అందవు. అభిరామస్వామి తిరిగి హతాశుడయాడు.

ఆయన వద్ద చిల్లిగవ్వ కూడా లేదు, బిచ్చమెత్తుకుని కాలక్షేపం చెయ్యవలిసిందే. ఒక రాజపుత్ర సైనికుడు తటస్థపడి ఆయనకొక రూపాయి ఇచ్చి, పోయిన వస్తువులు సాధ్యమైనంత త్వరలో ఆయనకు తిరిగి లభించేటట్టు చూస్తా నన్నాడు. అభిరామస్వామి చేతులు కట్టుకుని కూర్చోక, నగరమంతా తిరుగుతూ కనిపించిన ప్రతి హిందు-





వుడికీ, ముసల్మానుకూ తనకు కలిగిన చిక్కులన్నీ గాథగా చెప్పసాగాడు. త్వరలోనే ఆ గాథ నగర మంతా పాకింది.

ఆయుషా ఆగ్రాకు వచ్చి ఒక ఉమ్రావు ఇంట ఉంటున్నట్టు తెలిసింది. కాని అభిరామస్వామి ఆమెను కలుసుకోలేకపోయాడు. అయితే మరొక విధంగా పని సానుకూల మయేటట్టు కనబడింది. కొత్వాలు వద్ద ఉన్న ఉత్తరాలూ, ధనమూ మొదలైన వన్నీ తనకు పంపమని పాదుషా ఆజ్ఞ అయిందట. ఆయుషా ఏదో తంత్రం నడుపుతున్నది. పత్రాలన్నీ చేరవలిసిన చోటికి చేరాయి గనక అభిరామస్వామి బరువు దిగిపోయింది. ఆయన స్వదేశానికి తిరిగి వెళ్ళ నిశ్చయించుకుని, ఆయుషాను కలుసుకునే టందుకు మరొక ప్రయత్నం చేశాడు. అది విఫలమయింది.

మర్నాడు ఉదయం ఆయన కొత్వాలును చూడబోయాడు. కొత్వాలు ఆయనకూ, ఆయన అనుచరులకూ, అయిదువందల మొహరీ లిచ్చి, వాళ్ళు తమ గుర్రాలను తీసుకుని వెళ్ళిపోవచ్చునని చెప్పాడు. ఆయన ఆఖరుసారి ఆయుషాను చూసే ప్రయత్నంలో ఉమ్రావు ఇంటికి వెళ్ళాడు. ఆయుషా కనిపించలేదు గాని, ఆయన కొక ఉత్తరం అందజేసింది.

"మనం ఈ జన్మలో తిరిగి కలుసుకో మనుకుంటాను. యువరాజు జగతసిం హుడు ఎల్లప్పుడూ క్షేమంగా ఉండాలని నా కోరిక. అతన్ని నేను చూడవలిసిన అవసరం లేదు. నన్ను గురించి ఎవరూ ఆందోళన చెందవద్దు. నా సమాచారా లిక పైన మీకు తెలిసే అవకాశం లేదు," అని ఆయుషా రాసింది. అది చదివి అభిరామ స్వామి కంట నీరుపెట్టుకుని, తన ఇద్దరు అనుచరుల తోనూ వెళ్ళిపోయాడు.

ఆయుషా ఓడప్రయాణం చేసి కటకానికి రానున్నది. కటకానికి మైలు దూరాన మహా నది గట్టున ఓడరేవులో ఉస్మాన్‌ఖాన్ ఇద్దరు మనుషులను వెంటబెట్టుకుని ఆయుషా రాక కెదురు చూస్తున్నాడు.

మధ్యాహ్నం దాటిన మీదట ఆయుషా వచ్చే ఓడ దర్శనమయింది. అది అను కున్న దాని కన్న ఆలస్యమయింది. ఆయుషా కిటికీలో నుంచి తొంగి చూడటమూ, చెయ్యి ఊపటమూ గమనించిన ఉస్మాన్ మరొక ఘోరమైన విషయం కూడా చూశాడు. ఆయుషా ఎక్కిన ఓడకు క్రమంగా నీరెక్కి అది కొంచెం కొంచెమే మునిగిపోతున్నది.

ఉస్మాన్ రొమ్ము లోతు నీటిలోకి దిగి, "ఆయుషా, బయటికి దూకు. లోపల ఉన్న వాళ్ళను కూడా దూకమను. ఓడ మునుగు తున్నది," అని కేకపెట్టాడు.

ఓడ మునగకుండా చెయ్యటం కళాసు లకు సాధ్యం కాలేదు. వాళ్ళు చూస్తూ ఊరుకుండిపోయారు.

"ఉస్మాన్, ఒడ్డుకు వెళ్ళిపో! ఏమిటా పని?" అని ఆయుషా కేకపెట్టింది. ఓడలో వాళ్ళు హాహాకారాలు చెయ్యసాగారు. ఆయుషా ఓడలో నుంచి బయటికి రావటా నికి ప్రయత్నించక, వెళ్ళిపొమ్మని ఉస్మాన్‌కు చేత్తో సైగ చేస్తూ, ఓడతో బాటు నీటిలో మునిగిపోయింది.

—(ముగింపు వచ్చే సంచికలో)






# దొరికిన సొమ్ము

పట్టు వదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు మీది నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే, మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, శ్రమ పడుతున్నందుకు నీవు విచారించకు. ఎందుకంటే, సముద్రశూరుడి లాగా నీవు కూడా కష్టకాలంలోనే శుభాన్ని కూడా పొందవచ్చు. శ్రమ తెలియకుండా ఉండ గలందులకు నీకు సముద్రశూరుడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పూర్వం హర్షవర్మ ఏలిన హర్షపురంలో సముద్రశూరుడనే గొప్ప వర్తకు డుండే వాడు. అతను ఒకసారి సరుకుతో సహా సముద్రం మీద సువర్ణద్వీపానికి ప్రయాణ మయాడు. ప్రయాణం చాలా వరకు సుఖం గానే సాగింది గాని, సువర్ణద్వీపం చేర వస్తూండగా ఆకాశాన కారుమేఘాలు కమ్మి,

## బేతాళ కథలు





రత్నాలను చూశాడు, కాని అలాటి మణిని ఎన్నడూ చూడలేదు. అతను సముద్రంలో పోగొట్టుకున్న సరుకు కన్న ఈ మణి అనేక వందల రెట్లు విలువ గలది. ఆ సంగతి గ్రహించి పరమానందం చెంది, సముద్ర శూరుడు కలశపురమనే నగరానికి వెళ్ళి, నగరం వెలపల ఉండే ఆలయంలో నడుము వాల్చాడు. చాలాసేపు శ్రమపడి ఈది అలసి ఉండటాన అతనికి వెంటనే నిద్రపట్టింది. తనకు దైవికంగా దొరికిన కంఠాభరణాన్ని చేతిలోనే ఉంచుకుని సముద్రశూరుడు గాఢనిద్రలో పడ్డాడు.

కొంతసే పయాక నగర రక్షకులు అటుగా వచ్చారు. వాళ్ళు అతని చేతిలో ఉన్న కంఠాభరణాన్ని చూస్తూనే గుర్తిం చారు. అది చక్రసేన అనే రాజకుమార్తెది. దాన్ని దొంగ లెత్తుకుపోయారు. ఆ నిద్ర పోయేవాడే దొంగ అయి ఉంటాడనుకుని రక్షకభటులు సముద్రశూరుణ్ణి నిద్ర లేపి, అతణ్ణి ఉద్యానంలో ఉన్న రాజు దగ్గిరికి తీసుకుపోయారు.

"నువ్వెవరు? ఈ కంఠాభరణం నీ కెలా వచ్చింది?" అని రాజు అడిగాడు.

సముద్రశూరుడు జరిగినది జరిగినట్టుగా చెప్పి, "నాకు దొరికిన శవం సముద్ర

ప్రళయంగా గాలి వీచి, సముద్రం అల్ల కల్లోలమై, సముద్రశూరు డెక్కిన ఓడ కాస్తా మునిగిపోయింది. మునిగిపోయే ఓడ నుంచి సముద్రశూరుడు నీటిలోకి దూకి ఈద నారంభించాడు. అలా ఈదుకుంటూ పోతున్న సముద్రశూరుడి కేసి ఏదో శవం కొట్టుకు వచ్చింది. సముద్రశూరుడు దాన్ని తెప్పగా ఉపయోగించి తీరానికి చేరాడు.

అతను శవాన్ని ఒడ్డుకు లాగి పరీక్షించగా దాని బొడ్డున ఒక మూట కనిపించింది. మూట విప్పి చూడగా అందులో ఒక అమూల్యమైన మణి గల కంఠాభరణం ఉన్నది. సముద్రశూరుడు ఎన్నో విలువైన





తీరాన ఇంకా ఉండవచ్చు. కావలిస్తే మనుషులను పంపి విచారించండి, మహారాజా," అన్నాడు.

రాజు ఏమీ అనక ముందే ఎక్కడి నుంచో ఒక గద్ద రివ్వున వచ్చి, రాజు చేతి లోని కంఠాభరణాన్ని తన్నుకుని వాయు వేగంతో వెళ్ళిపోయింది.

సొమ్ము పోయినా నేర విచారణ చెయ్యక తప్పదు గనక రాజు తన మనుషులను సముద్రశూరుడి వెంట సముద్ర తీరానికి పంపాడు. శవం ఇంకా అక్కడే ఉన్నది. అది ఆ నగరానికి చెందిన ప్రసిద్ధుడైన చోరుడి శవం కావటం చేత రాజభటులు దాన్ని గుర్తించి, రాజుతో ఆ సంగతి చెప్పారు. సముద్రశూరుడు చెప్పినది నిజ మని రుజువయింది. రాజు ధర్మబుద్ధి గల వాడు. ఆయన సముద్రశూరుడికి కొంత డబ్బూ, కొంత వర్తకసామగ్రీ ఇచ్చి, ఓడ ఎక్కించి అతన్ని అతని దేశానికి పంపేశాడు.

ఈ సారి సముద్రశూరుడు క్షేమంగానే సముద్రం దాటాడు. అతను ఒక బిడారు వెంట తన సరుకులతో సహా హర్షపురానికి బయలుదేరాడు. వర్తకు లందరూ అరణ్య మార్గాన ప్రయాణిస్తూ, రాత్రివేళ ఒక చోట మజిలీ చేశారు. ఆ రాత్రి దొంగల



గుంపొకటి వాళ్ళ పైన పడి దొరికిన దల్లా తీసుకుని, అందిన వాళ్ళ నందరినీ హత్య చేయ సాగారు. సరుకు పోతే పోయిం దనుకుని సముద్రశూరుడు అక్కణ్ణించి పారిపోయి, ఒక మర్రి చెట్టెక్కి, ఆకుల మధ్య దాక్కున్నాడు.

దొంగలు దొరికిన సరుకంతా కొల్లగొట్టి తమ దారిన తాము వెళ్ళిపోయారు.

అయినా, తెల్లవారి బాగా వెలుతురు వచ్చిన దాకా సముద్రశూరుడు చెట్టు మీదే ఉండిపోయాడు. తరవాత అతను చెట్టు దిగుదామని అటూ ఇటూ చూసే సరికి, సమీపంలో ఉన్న కొమ్మ మీది తొర్రలో



తళుక్కున ఏదో మెరిసింది. సముద్ర శూరుడు దాన్ని సమీపించి, రాజకుమార్తె కంఠాభరణాన్ని గుర్తించాడు. ఎక్కడో సముద్రం అవతల కలశపురంలో గద్ద తన్నుకుపోయిన ఆ కంఠాభరణం, తలవని తలంపుగా ఈ భయంకరమైన అరణ్యం మధ్య ఈ మర్రిచెట్టు మీద తనకు రెండో సారి దొరకటం సముద్రశూరుడికి అంతులేని ఆశ్చర్యం కలిగించింది.

అతను చెట్టు దిగి వచ్చి, తన నగరం చేరుకుని, కంఠాభరణాన్ని తమ రాజుకే విక్రయించి, వర్తకం మానేసి, నిశ్చింతగా జీవించాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా నా కొక్క సందేహం. సముద్రశూరుడు ఆ కంఠాభర ణాన్ని ఎలాగైనా కలశపుర రాజుకు ఇవ్వక తానే ఎందు కుంచుకున్నాడు? లోభం చేతనా? లేక మరొకసారి తనకు దొంగతనం అంటగట్టుతారనా? ఈ సందేహానికి సమా ధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ఆ కంఠాభర ణాన్ని రాజు రెండుసార్లు పోగొట్టుకున్నాడు, మూడోసారి పోగొట్టుకోడని ఏమిటి? అలాగే అది తనకు రెండుసార్లు దైవికంగా దొరికింది. అలాటి దాన్ని ఎందుకు వదులుకోవాలి? అది అలా ఉండగా, వర్తకం కోసం తాను వెంట పెట్టుకు పోయిన సరుకు ఒకసారి సముద్రం పాలయింది, రెండోసారి దొంగలు దోచారు. ఇక తనకు వర్తకం అచ్చిరా దనుకున్నాడు. తాను సముద్రప్రయాణాలు చెయ్యకుండా ఆ హారాన్ని రాజుకు చేర్చటం సాధ్యం కాదు. ఇన్నీ ఆలోచించి సముద్ర శూరుడు ఆ కంఠాభరణాన్ని తానే ఉపయోగ పరచు కున్నాడు," అన్నాడు.

రాజు కీ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# స్త్రీ సహాయం

పూర్వం వర్ధమానుడనే రాజు మంజరి అనే రాజకుమార్తెను పెళ్లిచేసుకున్నాడు. మంజరి చాలా చక్కనిది కావటంచేత రాజు అస్తమానమూ ఆమెతోనే సుఖాలలో మునిగి తేలుతూ, రాచకార్యాలు కూడా చూడటం మానేశాడు. ఇలా అయిదేళ్ళు గడిచాయి. మంత్రులు మొదలుగాగల వారికి రెండు విధాల బాధ కలిగింది. ఒకసంగతి, రాజుగారు రాజ్యభారం ఏమాత్రమూ మీదవేసుకోవటం లేదు. రెండోసంగతి, అయిదేళ్లుగా కాపరం చేస్తున్నా మంజరి గర్భవతి కాలేదు. రాజ్యం దృష్ట్యా ఈ రెండూ చెడ్డవే.

జ్యోతిష్కులు మంజరి జాతకం చూసి, ఆమెకు సంతానప్రాప్తి లేదని చెప్పారు. మంత్రులు మంజరితో రహస్యంగా ఈమాట చెప్పగా, తనకా సంగతి చిన్నతనం లోనే తెలుసుననీ, సింహాసనానికి వారసులుండటం అవసరం గనక, తన భర్త మరొక భార్యను పెళ్ళాడేటట్టు చూస్తాననీ మంజరి వాళ్ళకు చెప్పింది.

అయితే రాజు మంజరి సలహా వినలేదు. "నేను మరొక భార్యను చేసుకుంటే మీ ఇద్దరిమధ్యా సవతిపోరు ఏర్పడుతుంది. అది నేను సహించలేను. పిల్లలు లేరన్న బెంగ నాకేమీలేదు. యోగ్యుడైనవాణ్ణి చూసి దత్తత చేసుకుంటే దేశానికి యువరాజంటూ ఏర్పడతాడు," అన్నాడు రాజు.

"నేను నా సవతిని సొంత చెల్లెలల్లే చూసుకుంటాను. నా మాట నమ్మండి," అన్నది మంజరి.

"నిన్నా సవతి సొంత అక్కలాగా చూసుకుంటుందని ఏమిటి? నువు బతికుండగా నేను మరొక భార్యను చేసుకోవటం కల్ల," అన్నాడు రాజు.

భార్యే లోకంగా రాజు కాలంగడుపుతూ ఉండటం చూసి సేనాధిపతికి దుర్బుద్ధిపుట్టింది.

బి. హనుమంతరావు

ప్రజలకూ రాజుకూ ఏలాటి సంబంధమూ లేదు. ప్రజల విశ్వాసానికి పాత్రుడైన యువ రాజు కూడా లేడు. ఈ పరిస్థితిలో తాను రాజును పడదోస్తే రాజుకు సహాయంచేసే వారెవరూ ఉండరు. అందుచేత అతను రాజు కొలువులో ఉండే పెద్ద ఉద్యోగస్తులను మంచిచేసుకుని, తన సైనికులతో రాజభవనాన్ని ముట్టడించాడు.

రాజధాని అంతా రాత్రికి రాత్రే అల్ల కల్లోల మయింది. రాజుగారి అంగరక్షకులూ, నౌకర్లూ హతులయారు. సేనాధిపతికి అంత రంగికుడల్లే నటిస్తూ వచ్చిన ఒక ఉద్యోగి ధర్మాన రాజు మాత్రం ప్రాణాలతో బయట పడి, తన రాజ్యం అవతల ఉన్న అరణ్యాల లోకి చేరుకున్నాడు.

మంజరి ఏమైనదీ రాజుకు తెలియరా లేదు. ఆమె కూడా తన మిగిలిన అనుచరులతోబాటు రాజభవనంలో శత్రువుల చేత చంపబడి ఉంటుందనుకుని రాజు దుఃఖించాడు. ఆ దుఃఖం కాస్త ఉపశమించాక ఆయనకు జీవితం మీదా, రాజ్యం మీదా విరక్తి పుట్టింది. ఆయన అరణ్యంలోనే ఒక పర్ణశాల నిర్మించుకుని, అందులో తాపసి లాగా ఉండసాగాడు.

రాజు అనుకున్నట్టు మంజరి చావలేదు. ఆమె మగవేషం వేసుకుని గుర్రమెక్కి



నిర్భయంగా అరణ్యానికి వచ్చేసింది. చిన్నతనంలోనే జ్యోతిష్కులు తన జాతకం చూసి తనకు సంతానయోగం లేదని చెప్పినప్పు డామె వివాహమే చేసుకోరాదని నిశ్చయించుకుని, గుర్రపుసవారీ, కత్తియుద్ధమూ, వేటా మొదలైన పౌరుష విద్యలు నేర్చింది.

ఇప్పు డామె అరణ్యంలో కూడా మగ వేషంతోనే తిరుగుతూ, వేటగాడి జీవితం గడుపుతూ, తన భర్త గడిపే అశ్రమవాసాన్ని దూరంగా ఉండి కనిపెట్టుతున్నది. అమె నివశించే కుటీరం కూడా ఆ దాపులనే వున్నది. తన భర్తకు ఎలాగైనా తిరిగి రాజ్యప్రాప్తి కలిగించాలనే ఉద్దేశం తప్ప అమె మనసులో మరొక ఆలోచన లేదు.

ఇలా ఉండగా ఒకనా డామె కొక విచిత్రమైన అనుభవం జరిగింది. సాయంకాలంవేళ ఆమె అరణ్యంలో ఉన్న ఒక సరస్సు సమీపాన కూర్చుని ఉండగా, నీటిలో నుంచి ఒక పాము ఈదుకుంటూ ఒడ్డుకు వచ్చింది. అది చాలా పెద్ద పాము కావటం చేత, అలాటి దాన్ని బతికి ఉండనివ్వరా దనుకుని మంజరి చప్పున ఖడ్గం దూసి, దాని తల నరికింది. అలా నరకగానే దాని నోటి నుంచి ఒక పెద్ద నీలమణి పడిపోయింది. మణి పడిపోయిన మరు





క్షణం పాము కళేబరం ఒక భీకరమైన రాక్షసుడి కళేబరంగా మారిపోయింది.

ఆ మార్పు చూసి నిర్ఘాంతపోయిన మంజరి, ఆ నీలమణి నోట పెట్టుకున్నందు చేత రాక్షసుడికి పాము రూపం వచ్చిందా అన్న అనుమానం కలిగింది. ఆమె వెంటనే ఆ మణిని తీసి, సరస్సు నీటిలో కడిగి, తన నోట పెట్టుకుని, తాను కూడా పాముగా మారిపోయింది.

రాక్షసుడి నివాసం కొలనులోపల ఎక్కడో ఉండి ఉండాలి. అది తెలుసుకుందామని ఆమె పాము రూపంలో నీటిలో ప్రవేశించింది.

మంజరి నీటి అడుగున చాలాసేపు తిరిగినమీదట ఒక ద్వారంలాటిది కనిపించింది. అందులో ఉన్న కంత కుండా ఆమె దూరి అవతలికి వెళ్ళింది. అవతల మెట్లున్నాయి. మెట్లెక్కి పైకి వచ్చేసరికి, నీటి మట్టానికి ఎగువగా మరొకద్వారం ఉన్నది. ఆ ద్వారంలోకూడా ఒక కంత ఉన్నది. ఈ కంతలు రాక్షసుడు ఏర్పాటు చేసుకున్నవే.

మంజరి ఆ కంతలో నుంచి దూరి లోపలికి వెళ్ళింది. అక్కడ ఒక విశాలమైన గది ఉన్నది. అందులో ఒక అందమైన అమ్మాయి కూర్చుని ఉన్నది. ఆమె పామును చూస్తూనే వణికిపోతూ, లేచి నిలబడి, భయభ్రాంతురాలైనట్టు కనబడింది.

వెంటనే మంజరి తన నోటి నుంచి నీలమణిని జారవిడిచి, తన మామూలు రూపం ధరించి, "భయపడకమ్మా, నన్ను చూసి రాక్షసు డనుకున్నట్టున్నావు. నేనా రాక్షసుణ్ణి యింతకు ముందే చంపేశాను. నువ్వెవరు? ఇక్కడ ఎందుకున్నావు? నా వల్ల నీకేం ఉపకారం కావాలి?" అని బుజ్జగిస్తూ అడిగింది.

"నేను వజ్రగిరి రాజు కూతుర్ని. నా పేరు సౌదామిని. నన్ను నిన్ననే ఈ రాక్షసు డెత్తుకొచ్చి ఇక్కడ బంధించాడు. మూడు

రోజుల లోపల నేను తనకు భార్య కాకపోతే నన్ను చంపేస్తానని బెదిరిస్తున్నాడు. నన్నెలాగైనా మా ఇంటికి చేరిస్తే నీ దయ జన్మలో ఎప్పటికీ మరవను," అన్నదామె.

"ఇంక నీకు రాక్షసుడి భయం లేదని చెప్పానుకద! ఈ కారాగృహం నుంచి నేనే స్వయంగా నిన్ను బయటికి చేరుస్తాను. ఆ తరవాత నువు మీ తండ్రి ఇంటికి చేరే ఉపాయం మాట ఆలోచించుకోవచ్చు," అన్నది మంజరి.

ఆమె తిరిగి నీలమణి నోటబెట్టుకుని పాము రూపంలో బయటికివెళ్ళి, కంతలో నుంచి నీలమణిని సౌదామినికి అందించింది. దాని సహాయంతో సౌదామిని పామురూపం ధరించి, బయటికి వచ్చి, మెట్ల మీద తన కోసం వేచి ఉన్న మంజరిని కలుసుకున్నది.

కొలను అడుగున ఉన్న కంత నుంచి కూడా వాళ్ళిద్దరూ ఇలాగే దూరారు. ఆ తరవాత ఇద్దరూ ఈదుకుంటూ కొలను బయటికి తమ రూపాలతోనే వచ్చారు.

అప్పటికి అర్ధరాత్రి దాటింది. మంజరి తిరిగి పురుషవేషం ధరించి, "నిన్నిప్పుడొక మహనీయుడి ఆశ్రమం దాకా తీసుకుపోతాను. నా సంగతి నువ్వాయనకు ఏవిధంగానూ చెప్పకూడదు. నిన్ను నీ పుట్టింటికి చేర్చమనీ, మిగతా సంగతులేవీ అడగవద్దనీ





ఆయనను కోరు. మనం మళ్ళీ త్వరలోనే కలుసుకుంటాం," అని సౌదామినికి చెప్పింది. తరవాత ఇద్దరూ రాజుండే పర్ణశాల దాకా నడిచి వెళ్ళారు. అక్కడ మంజరి సౌదామిని వద్ద సెలవుతీసుకుని తన కుటీరానికి వెళ్ళిపోయింది.

సౌదామిని తలుపు తట్టగానే రాజు లేచి వచ్చి తలుపు తెరిచాడు. ఎవరో ఎరగని అమ్మాయిని చూసి ఆశ్చర్యపడి, "ఏం కావాలి?" అన్నాడు. అలాటిచోట ఆశ్రమవాసం చేసేవాడు వృద్ధుడై ఉంటాడనుకున్న సౌదామిని, అతను యువకుడు కావటం చూసి సిగ్గుపడుతూ తలవంచుకుని, "నేను వజ్రగిరి రాజకుమార్తెను. దయచేసి నన్ను మా తండ్రి ఇంట దిగబెట్టగలరా?" అని అడిగింది.

రాజు ఆమెను ఎలాటి ప్రశ్నా అడగలేదు. చివరకామె పేరు తెలుసుకునేందుకైనా ప్రయత్నించలేదు.

అతను అప్పటికప్పుడే ప్రయాణానికి సిద్ధమై తన గుర్రం మీదనే ఆమెను కూడా ఎక్కించుకుని, మర్నాడు జాము పొద్దెక్కే సరికల్లా వజ్రగిరి చేరుకున్నాడు.

వజ్రగిరి రాజు తన కుమార్తె తిరిగి దొరికినందుకు పరమానందం చెందాడు. ఆయన వర్ధమానుడి పేరు వినగానే, "మిమ్మల్ని మీ సేనాధిపతి మోసగించాడని విన్నాను. మీరు అరణ్యంలో ఆశ్రమవాసం చేసుకుంటున్నట్టు అమ్మాయి చెప్పింది. మీ కంత దురవస్థ దేనికి? మాబోటివాళ్ళం తోడు వచ్చి, మీ రాజ్యం మీ కిప్పించలేక పోయామా?" అన్నాడు.

వర్ధమానుడు నిస్పృహగా, "నేనా రాజ్యం గురించి ఏనాడూ పట్టించుకోలేదు. నా ప్రజలకు కూడా నాతో పనిలేదు. ప్రజల సమ్మతి లేకుండా సేనాధిపతి నా కలా ద్రోహం చేసి ఉండడు. నాకు ప్రాణంకన్న ఎక్కువైన నా భార్య చనిపోయింది.

నా కిప్పుడు ప్రపంచంలో కోరదగినదేదీ లేదు," అన్నాడు.

"మీకు ప్రపంచంలో ఎవరూ లేరను కోవటం పొరపాటు. మా సౌదామినికి మిమ్మల్ని ఆశ్రయించమని ఒక వ్యక్తి చెప్పినట్టు విన్నాను. ఆ వ్యక్తికి మీపైన ఎంతో భక్తి అని మా అమ్మాయి చెబుతున్నది. ఆ మాటకువస్తే మా సౌదామినే మిమ్మల్ని ఎంతో ఆదరంతో చూస్తున్నది. తాను మీ సహాయం కోరినదేతడవుగా, ఒక్క ప్రశ్న అయినా వెయ్యకుండా బయలుదేరి వచ్చారట. అలాటివాళ్ళు ప్రపంచంలో నిజంగా ఉండరు. నిండా పాతికేళ్ళయినా లేని మీకు వైరాగ్యం ఏమీ ఉచితంగాలేదు. జరిగినదేదో జరిగింది. మీరు మా సౌదామినిని పెళ్ళాడి, మా చిన్న రాజ్యాన్ని ఏలుకోండి. మీరు చేసిన మేలుకు ఇదే నేను చెయ్యగల ప్రత్యుపకారం," అన్నాడు వజ్రగిరిరాజు.

వజ్రగిరిరాజు ఔదార్యంతో వర్ధమానుడి మనస్సు కాస్త మెత్తబడింది. అతను కొంతకాలం వ్యవధి అడిగి, చివరకు సౌదామిని చూపే ప్రేమకు లొంగిపోయి, ఆమెను పెళ్ళాడాడు.

అక్కడ అరణ్యంలో మంజరి, తన భర్త సౌదామినితో సహా గుర్ర మెక్కి



బయలుదేరే దాకా మాటున దాగి ఉండి, ఆ తరవాత తాను కూడా తన దేశానికి తిరిగి వెళ్ళింది. ఆమె నీలమణి సహాయంతో రాత్రిపూట సంచరిస్తూ, నగరంలోని పరిస్థితి అంతా తెలుసుకున్నది. సేనాధిపతి ప్రజలను ఉద్ధరించటానికి రాజైనవాడు కాడు; అందు చేత రాజవైభవాలలో ఓలలాడుతూ ప్రజలను పీడిస్తూ, అడ్డమైన అత్యాచారాలూ చేస్తున్నాడు.

ఇది తెలిశాక మంజరి మంత్రి వద్దకూ, ఇతర ఉన్నతోద్యోగుల వద్దకూ వెళ్ళి, తాను ఫలానా అని తెలుపుకుని, తన భర్త వజ్రగిరిలో ఉన్నట్టు చెప్పింది. వెంటనే మంత్రి వజ్రగిరికి ఒక దూతను పంపి, వర్థమానుడు కొద్ది సేనతో రహస్యంగా అర్ధరాత్రివేళ వచ్చి, రాజమందిరాన్ని ప్రవేశించే ఏర్పాట్లు చేశాడు. వర్థమానుడు కొద్దిమంది అనుచరులతో బయలుదేరి తన రాజధానీనగరం చేరాడు.

ఒకనాటి అపరరాత్రి సేనాధిపతీ, అతని ముఖ్యానుచరులూ తాగి తందనాలాడే సమయంలో సైనికులు వాళ్ళను చుట్టుముట్టి కారాగృహంలో ఉంచారు. మర్నాడు వర్థమానుడు రాజసభకు వచ్చి సింహాసనం మీద కూర్చున్నాడు. సభికులు మొదట నిర్ఘాంతపోయి, తరవాత ఎంతో సంతోషించారు. రాజద్రోహుల విచారణ జరిగింది. అందరికీ ఉరిశిక్ష పడింది. నగరవాసులు మూడు రోజులపాటు ఉత్సవం చేసుకున్నారు. తమ రాజుగారు మరొక భార్యను చేసుకున్నాడనీ ఆమె గర్భవతిగా ఉన్నదనీ తెలిసి ప్రజలు పొందిన ఆనందం అంతా ఇంతా కాదు.

అటు తరవాత వర్థమానుడు ప్రజాపరిపాలనలో అసక్తి చూపుతూ, ఇద్దరు భార్యలతోనూ కాపరం చేస్తూ, కాలక్రమాన రెండు దేశాలకూ రాజై చాలా కాలం సుఖంగా జీవించాడు.





# తేనెపిట్ట

ఆఫ్రికాలోని పర్వత ప్రాంతపు అరణ్యంలో ఇద్దరు అన్నదమ్ము లుండేవారు. వారిద్దరూ అరణ్యంలో వేటాడి తమ కుటుంబానికి కావలిసిన ఆహారం తెస్తూ ఉండేవారు.

ఒకనాడు ఆ అన్నదమ్ములు చెరొక తోలుసంచీ భుజాన వేసుకుని, చెరొక విల్లూ, బాణాలూ తీసుకుని తమ ఇంటి నుంచి వేటకు బయలుదేరారు. అరణ్యం లోకి వెళ్ళే దారి వెంట వారు కొంతసేపు నడిచి, తరవాత దారి కూడా లేని కీకారణ్యం లోకి అడుగుపెట్టారు.

కొంత దూరం వెళ్ళేసరికి ఒక చోట వరసగా మట్టికుండలు బోర్లించి ఉన్నాయి.

"ఏమిటిది? ఈ నిర్జన ప్రదేశంలో వీటిని ఎవరు ఉంచి ఉంటారు?" అన్నాడు తమ్ముడు.

"వాటి జోలికి పోకు. అందులో ఏం చేతబడి ఉందో! మన కెందుకొచ్చిన పీడ?" అన్నాడు అన్న. అతను కాస్త పిరికి వాడు. కాని తమ్ముడు ధైర్యం గలవాడు. "వాటి కింద ఏముందో చూసి తీరాలి," అన్నాడు వాడు.

చిన్నవాడు ఒక్కొక్క కుండనే ఎత్తి సరిగా నిలబెట్టుతుంటే అన్న దూరంగా పారిపోయి, భయపడుతూ చూడసాగాడు.

తమ్ముడు ఎత్తి సరిగా నిలబెట్టే కుండల కింద ఏమీ లేదు. కాని వాడు ఆఖరు కుండను ఎత్తేసరికి, దాని కింది నుంచి ఒక పొట్టి ముసలమ్మ చెంగున ఇవతలికి దూకింది.

ఆమె, తనను విడిపించిన చిన్నవాడి కేసి చూడనన్నా చూడక, దూరాన నిలబడి ఉన్న పెద్దవాడితో, "ఎందు కలా బెదురు గొడ్డు లాగా నిలబడి వణికిపోతావు? నేను నిన్నేమీ చెయ్యను. నా వెంట వచ్చావంటే మంచి చిత్రం చూపిస్తాను," అన్నది.

ఎల్. శాంతకుమారి



కాని పెద్దవాడు కొయ్యబొమ్మ లాగా నిలబడిన చోటి నుంచి కదలనే లేదు.

"పిరికి వెధవా!" అని ఆమె వాణ్ణి తిట్టి, చిన్నవాడి కేసి తిరిగి, వాణ్ణి తన వెంట రమ్మన్నది. అన్నిటికీ తెగించిన చిన్నవాడు ఆమె వెంట బయలుదేరాడు.

ఇద్దరూ కొంతదూరం వెళ్ళాక ముసలిది ఆగి, చిన్నవాడి చేతికొక గొడ్డలి ఇచ్చి, "నాకీ చెట్టు కొట్టిపెట్టు," అన్నది.

వాడు గొడ్డలితో చెట్టుమానును ఒక్క దెబ్బ కొట్టేసరికల్లా మాను నుంచి ఒక ఆవు బయటికి దూకింది. అలాగే వాడు కొట్టిన ప్రతి దెబ్బకూ ఒక ఆవో, మేకో, గొర్రో, ఎద్దో మాను నుంచి బయటికి వచ్చింది. త్వరలోనే వాడి చుట్టూ పెద్ద పశువులమంద తయారయింది.

"ఇవన్నీ నీకే. వీటిని తోలుకుని నువు ఇంటికి వెళ్ళిపోవచ్చు. నే నిక్కడే ఉండి పోతాను," అన్నది ముసలమ్మ.

తమ్ముడామెకు కృతజ్ఞత తెలుపుకుని పశువుల నన్నిటినీ తోలుకుంటూ అన్న ఉన్న చోటికి వచ్చి, "ముసలిది నా కేమిచ్చిందో చూడు. ఆమె పిలిచినప్పుడు వెళ్ళక పోతివి," అన్నాడు. తమ్ముడు పశువులను సంపాదించిన వైనమంతా విని అన్న ఏమీ అనలేదు.

ఇద్దరూ కలిసి గొడ్లతో సహా తమ గ్రామం కేసి బయలుదేరారు.

అసలే నడివేసవి. మంచి ఎండవేళ. అన్నదమ్ము లిద్దరినీ దాహం తెగబాధిస్తున్నది. పశువులు కూడా పచ్చిగడ్డి కోసం తహతహ లాడుతూ ఆకలితో అరుస్తున్నాయి.

కొంతదూరం వెళ్ళేసరికి చిన్నవాడు, "చూడు, నీళ్ళు!" అని అరిచాడు. వారి దారికి పక్కగా ఒక అగాధం ఉన్నది. అందులో చెట్ల మధ్యగా ఒక వాగు గలగలా ప్రవహిస్తున్నది. కాని అక్కడికి దిగే దారి లేదు. అక్కడ కొండ నిటారుగా ఉన్నది.



"నన్ను తాటితో దింపుతావా? దప్పి తీర్చుకుని మళ్ళీ పైకి వస్తాను," అన్నాడు అన్న తమ్ముడితో.

తమ్ముడు అలాగే చేశాడు. అన్న అగాధం లోకి వెళ్ళి, కడుపు నిండా చల్లనినీరు తాగి, లేచివచ్చిన ప్రాణాలతో మళ్ళీ పైకివచ్చాడు.

"నన్నుకూడా దించు. నేను కూడా దాహం తీర్చుకుంటాను," అన్నాడు తమ్ముడు. అన్న తాడు పట్టుకుని తమ్ముణ్ణి అగాధంలోకి దిగనిచ్చాడు. పశువులన్నిటినీ చూస్తుంటే వాడికి దుర్బుద్ధిపుట్టింది. వాడు చేతిలో ఉన్న తాడుకొస అగాధంలోకి విసిరేసి, తమ్ముణ్ణి అగాధంలో 'దిక్కులేని చావు చావటానికి వదిలేసి, గొడ్లను తోలుకుని ఇంటికి వెళ్ళి తన తల్లిదండ్రులతో, "ఒక ముసలిది నాకీ గొడ్లన్నిటినీ ఇచ్చింది," అన్నాడు.

"అలాగా? తమ్ముడేడీ?" అని అడిగాడు తండ్రి.

"వాడింటి కింకా రాలేదా? వాడు నడవలేక ఇంటికి తిరిగి పోతానని మిట్టమధ్యాహ్నం వేళననగా బయలుదేరాడు. నేను మళ్ళీ వాణ్ణి చూడలేదు," అన్నాడు అన్న.

ఆ రోజల్లా చిన్నవాడు ఇంటికి తిరిగి రానేలేదు. కాని, వేటాడటానికి ఎటుగా వెళ్ళాడో లెమ్మనుకుని పెద్దవాళ్ళు అంతగా విచారించలేదు.

మర్నాడు చీకటితో ఆడవాళ్ళు ఊరి బావి దగ్గిర నీళ్ళు తోడుకునేటప్పుడు తేనెపిట్ట కూత వినిపించింది. ఆ ప్రాంతాల వాళ్ళు తేనెపిట్ట కూత వినిపిస్తే దాని వెంబడి పోతారు. ఎందుకంటే తేనెపిట్టలు వెళ్ళి వెళ్ళి తేనెపట్టుల వద్దకు చేరుకుంటాయి. మగవాళ్ళు ఆ తేనెపట్టులను కొట్టి తేనెపిండి తెచ్చుకుంటారు.

అందుచేత ఆ స్త్రీలు గబగబా తమ ఇళ్ళకు వెళ్ళి మగవాళ్ళతో, "త్వరగా పదండి. తేనెపిట్ట కూస్తున్నది!" అన్నారు.

అన్నదమ్ముల తండ్రీ మరి కొందరు గ్రామస్తులూ తేనెపిట్ట కూతను బట్టి బయలుదేరారు. అది వారిని చాలా దూరం తీసుకుపోయింది. సాధారణంగా తేనెపిట్ట కూత తేనెపట్టుకు కొద్దిపాటి దూరంలోనే వినిపిస్తుంది. ఈ పిట్ట మాత్రం ఎంత దూరం వెళ్ళినా ఆగటం లేదు. అందుచేత చాలామంది మగవాళ్ళు ఇళ్ళకు మళ్ళారు. అన్నదమ్ముల తండ్రీ మరి కొద్దిమందీ మటుకు ఇంకా కొంచెం దూరం వెళ్ళి చూడ నిశ్చయించారు.

తేనెపిట్ట వెళ్ళివెళ్ళి చప్పున అగాధం లోకి దిగిపోయింది. అందులో తేనెపట్టు ఉన్నప్పటికీ ప్రయోజనం లేదు. అందుచేత ఆ పిట్ట వెంట అక్కడిదాకా వచ్చినవాళ్ళు నిరాశచెందారు.

అన్నదమ్ముల తండ్రి అగాధంలోకి తొంగి చూశాడు. అతనికి పిట్టజాడ కనిపించ లేదు గాని మనిషి జాడ కనిపించింది. అస్పష్టంగా మనిషి కంఠం కూడా విని పించింది. "నా కొడుకు! వాడే ఆ అగాధంలో ఉన్నాడు!" అని ఆ తండ్రి కేకపెట్టాడు.

నలుగురూ కలిసి అగాధంలోకి తాడు జార్చి, చిన్నవాణ్ణి పైకి లాగారు.

చిన్నవాడు చెప్పినదంతా విని తండ్రి వలవలా ఏడ్చాడు. "పెద్దవాడు ఇంత నీచానికి పాల్పడతాడని ఎన్నడూ అనుకో లేదు! నీ కింత ద్రోహం చేశాడా? ఆ తేనె పిట్ట పుణ్యాన బతికావుగాని, లేకపోతే నీగతి ఏమై ఉండేది?" అన్నాడతను.

"ఆ పెద్దవాణ్ణి నిలువునా చీల్చాలి! పాపిష్టి వెధవ!" అన్నారు మిగిలినవాళ్ళు.

కాని పెద్దవాడి కెలా తెలిసిందో, తన తమ్ముడు అగాధంలో నుంచి పైకి వచ్చేసి నట్టు తెలిసింది. తన తండ్రీ, తమ్ముడూ ఇల్లు చేరేలోపునే వాడు ఇల్లూ, గ్రామమూ విడిచి ఎటో పారిపోయాడు. వాడి జాడ మరి తెలియరాలేదు.





# గుణశర్మ కథ

ఉజ్జయినిలో ఆదిత్యశర్మ అనే బ్రాహ్మణ యువకు డుండేవాడు. అతను ఒక సన్యాసితో స్నేహం చేశాడు. ఆ సన్యాసి యక్షిణిని సాధించినవాడు. అయితే ఆ యక్షిణి విద్యున్మాల అనే యక్షిణికి చెలికత్తె. ఆ యక్షిణి ద్వారా ఆదిత్యశర్మ, అందరు యక్షిణుల లోకీ ఉత్కృష్టురాలు సులోచన అనే యక్షిణి అని గ్రహించి, దక్షిణ దేశానికి వెళ్ళి, విష్ణుగుప్త డనే సన్యాసి ద్వారా సులోచనా మంత్రవిధి నేర్చుకుని, సంపూర్ణ హోమం చేసి సులోచనను సిద్ధింప జేసుకున్నాడు. తన వెంట ఉంటూనే ఆరు మాసాలు బ్రహ్మచర్యం అవలంబించి నట్టయితే ఆదిత్యశర్మకు సర్వజ్ఞుడైన కొడుకును కంటానని మాట ఇచ్చి, సులోచన అతన్ని తన విమానంలో అలకాపురానికి తీసుకుపోయింది. ఆదిత్యశర్మ ఆరునెలలు బ్రహ్మచర్యం అవలంబించాక కుబేరు డతన్ని చూసి ఎంతగానో మెచ్చుకుని, సులోచనకూ అతనికీ, దేవతావివాహం జరిపించాడు. తరవాత వారికి గుణశర్మ అనే కుమారుడు కలిగాడు.

కొంత కాలం జరిగాక కుబేరుడి వద్దకు దేవేంద్రుడు వచ్చాడు. అందరూ ఇంద్రుణ్ణి చూడగానే నిలబడ్డారు. ఆదిత్యశర్మ పరాకున ఉండి లేవలేదు. అది చూసి ఇంద్రుడు, "నువ్వీ లోకంలో ఉండ తగవు, మానవలోకానికి వెళ్ళిపో," అన్నాడు. అలాటి శిక్ష తన భర్త కివ్వవద్దని సులోచన ఇంద్రుణ్ణి వేడుకున్నది. "నా మాట వృథా కారాదు. అతను వెళ్ళకపోతే అతని కొడుకైనా మానవలోకానికి వెళ్ళి తీరాలి," అన్నాడు ఇంద్రుడు. తప్పేది లేదు గనక ఆదిత్యశర్మ తన కొడుకైన గుణశర్మను అతని మేనమామల ఇంట దించి, తాను అలకానగరానికి తిరిగి వెళ్ళిపోయాడు.



గుణశర్మకు ఉజ్జయినీ రాజైన మహాసేనుడితో స్నేహమయింది. గుణశర్మ దేవతాంశ గలవాడు, సకల విద్యలూ తెలిసినవాడు, మహాశూరుడు, గొప్ప అందగాడు.

రాణి అయిన అశోకవతికి గుణశర్మ మీద మోహం పుట్టుకొచ్చింది. ఆమె తన భర్తనడిగి గుణశర్మ దగ్గిర వీణ వాయించటం నేర్చుకో నారంభించింది. ఒకనాడు ఎవరూ దగ్గిర లేని సమయంలో రాణి మనసువిప్పి అతనిపై తనకు గల కోరికను చెప్పేసింది. గుణశర్మ ఆమె బుద్ధి మరల్ప యత్నించాడు. తన బుద్ధి మారదనీ, గుణశర్మ తన కోరిక తీర్చకపోతే అతన్ని చంపి తాను చస్తాననీ రాణి అన్నది. అలా చావటానికి తనకు అభ్యంతరం లేదన్నాడు గుణశర్మ. అప్పటికీ వదలక ఆమె అతన్ని తన కోరిక తీర్చమని కాళ్ళావేళ్ళా పడింది. తొందరపడ వద్దనీ, ఆమె కోరిక తీర్చుతానని గుణశర్మ అబద్ధపు వాగ్దానం చేసి అప్పటికి తప్పించుకున్నాడు.

కొద్ది రోజులు గడిచాక మహాసేనుడు సోమకు డనే శత్రువుతో యుద్ధం ప్రారంభించాడు. ఆ సమయం చూసి గౌడరాజైన విక్రమశక్తి అనే మరొక శత్రువు మహాసేనుడి పైకి యుద్ధానికి వచ్చాడు. ఇద్దరు శత్రువుల మధ్య ఇరికిన తన రాజును కాపాడటానికి గుణశర్మ అంతర్ధాన విద్య ద్వారా అర్ధరాత్రి వేళ విక్రమశక్తి శిబిరానికి వెళ్ళి, ఆ రాజును లేపి, "రాజా, నేను విష్ణు దూతను. విష్ణుభక్తుడివి గనక నన్ను ఆ దేవుడు పంపి నీకు సలహా ఇవ్వమన్నాడు. నువు మహాసేనుడితో సంధి చేసుకుని తిరిగిపోకపోతే నీకూ, నీ సేనకూ ఘోరప్రమాదం ఉన్నది," అన్నాడు.

విక్రమశక్తి ఈ విష్ణుదూతను నమ్మి, మహాసేనుడితో సంధి చేసుకుని, సైన్యంతో సహా తిరిగివెళ్ళాడు. మహాసేనుడు సోమకుణ్ణి జయించాడు. తరవాత కొద్ది కాలానికి

మహాసేనుడికీ, విక్రమశక్తికీ మధ్య దారుణమైన యుద్ధం జరిగింది. అందులో ప్రబల శత్రువులైన ఇద్దరు రాజులూ కత్తి యుద్ధానికి తలపడ్డారు. ఆ ద్వంద్వ యుద్ధంలో మహాసేనుడు కాలు జారి పడిపోయాడు. వెంటనే విక్రమశక్తి అతన్ని చంపాలని కత్తి ఎత్తాడు. సమీపంలోనే ఉన్న గుణశర్మ చక్రం ప్రయోగించి, విక్రమశక్తి ఎత్తిన చేతిని నరికేశాడు, వెంటనే పరిఘతో విక్రమశక్తిని చంపేశాడు. విక్రమశక్తి చావటంతో అతని రాజ్యం మహాసేనుడి దయింది.

గుణశర్మ తన ప్రాణాలను అప్పటికి అయిదు సార్లు కాపాడాడని లెక్కగట్టి, "బ్రాహ్మడా, నీ రుణం ఎలా తీరుతుంది?" అన్నాడు మహాసేనుడు.

మహాసేనుడితో బాటు గుణశర్మ ఉజ్జయినికి తిరిగి రాగానే రాణి అశోకవతి తిరిగి అతన్ని పీడించసాగింది. కాని గుణశర్మ ఎంతమాత్రమూ చలించలేదు. చివరకు అశోకవతికి రోషం వచ్చి, గుణశర్మ తనను బలాత్కరించబోయాడని రాజుతో అన్నది. రాజు ఆమె మాట నమ్మి గుణశర్మను చంప నిశ్చయించాడు. అయితే అది బహిరంగంగా చెయ్యటానికి ఆయనకు ధైర్యం చాలలేదు. అతను రాజు ప్రాణాలను చాలా సార్లు కాపాడిన సంగతి అంద





రికీ తెలుసు. గుణశర్మ తన భార్యను చెరచ బోయాడని నలుగురికీ తెలియనివ్వటం కూడా యశస్సుకు భంగమే. అందుచేత మహాసేనుడు గుణశర్మను యుక్తిగా చంప నిశ్చయించాడు. ఒకనాడు నిండు సభలో రాజు, "ఈ గుణశర్మ కంటె నాకు ఆప్తులు లేరని ఇతన్ని అందల మెక్కించాను. ఒకప్పుడు నా శత్రువైన విక్రమశక్తి తన వేగులవాణ్ణి నాకు వంటవాడుగా పంపి, నాకు విషం పెట్టించ యత్నించాడు. అప్పుడీ గుణశర్మ నన్నా విషపు పచ్చడి తినకుండా చేసి, నా ప్రాణం కాపాడినట్టు నటించాడు. కాని అదంతా ఒక నాటకం. ఈ గుణశర్మ నాకు ద్రోహం చేసి విక్రమశక్తి దగ్గిర డబ్బు సంపాదించాలని ప్రయత్నించి రాయబారాలు నడిపాడు. డబ్బు వృథా చెయ్యటం దేనికని విక్రమశక్తి వంటవాణ్ణి పంపి నాకు విషం పెట్టించ యత్నించాడు. గుణశర్మ పెద్ద రాజ ద్రోహి," అన్నాడు.

"ఈ కట్టు కథ ఎవరి కల్పన?" అని గుణశర్మ రాజు నడిగాడు.

"పచ్చడిలో విషం ఉన్న సంగతి నీ కసలు ఎలా తెలిసింది?" అని రాజు గుణశర్మను ఎదురు ప్రశ్నించాడు.

"ప్రజ్ఞ గలవాడికి అన్నీ తెలుస్తాయి," అన్నాడు గుణశర్మ.

రాజు అతన్ని చంపబోయాడు. గుణశర్మ తప్పించుకుని, తన పైకి వచ్చిన రాజ భటులను చంపుతూ, అంతర్ధాన విద్యతో అందరి కళ్ళూ కప్పి ఉజ్జయిని నుంచి బయటపడి దక్షిణదేశానికి బయలుదేరాడు.

ఒక గ్రామంలో ఒక మర్రి చెట్టు కింద అగ్నిదత్తుడనే బ్రాహ్మణుడు తన శిష్యుల చేత అధ్యయనం చేయిస్తున్నాడు. గుణశర్మ అక్కడికి వెళ్ళి ఆ బ్రాహ్మణుడికి నమస్కారం చేశాడు. అగ్నిదత్తుడు గుణశర్మ ద్వారా అతని తండ్రి కథా, అతని కథా విని, "బాబూ, ఈ గ్రామం నా అగ్రహ

రమే. మా ఇంటికి రా. ఇక్కడ నువు సుఖంగా ఉండవచ్చు," అన్నాడు.

అగ్నిదత్తుడి ఇల్లు పుష్కలమైనది. అన్ని సంపదలతోబాటు ఆయనకు సుందరి అనే చక్కని చుక్క అయిన కుమార్తె కూడా ఉన్నది. సుందరిని గుణశర్మ చేసు కుంటే ఔనని బ్రాహ్మణుడికి తోచింది. ఆ పిల్ల భవిష్యత్తు ఎలాగుంటుందో సాముద్రి కాన్నిబట్టి చెప్పించుకునే మిషమీద ఆమెనా బ్రాహ్మణుడు గుణశర్మకు చూపాడు.

"ఈమెకు ముక్కు మీదా, వక్షం మీదా పుట్టుమచ్చలున్నాయి. అందుచేత ఈపిల్లకు సవతులుంటారు," అన్నాడు గుణశర్మ.

"అదొక అశుభం అనరాదులే. సవతు లుంటారంటే సంపన్నుడే దాన్ని చేబడతా డన్నమాట. పిల్లలో ఇతర అశుభ లక్షణా లేవీ లేవుగద?" అన్నాడు అగ్నిదత్తుడు.

"సలక్షణమైన పిల్ల! అశుభాల మాటే లేదు," అన్నాడు గుణశర్మ.

కొన్ని రోజులు గడిచాక అగ్నిదత్తుడు గుణశర్మతో, "నాయనా, మా సుందరిని పెళ్ళాడి ఇక్కడే ఉండిపో. వేరే ఏ దేశమో పోవటం దేనికి?" అన్నాడు.

"అయ్యా, అంతకంటె నిజంగా కోర దగిన దేముంటుంది? కాని ఉజ్జయినీ రాజు అకారణంగా నాకు చేసిన అన్యాయానికి



ఎంత కుమిలిపోతున్నానో మీకు తెలీదు. నేను ఏ సుఖమూ అనుభవించలేని స్థితిలో ఉన్నాను," అన్నాడు గుణశర్మ.

"ఇంత పండితుడివి, నువుకూడా ఇలా మాట్లాడతావేమిటి? మూఢుడు చేసిన అవమానం నీలాటి పవిత్రుణ్ణి అంటుతుందా?" అన్నాడు అగ్నిదత్తుడు.

"ఉజ్జయిని ఇక్కడికి దగ్గరలోనే ఉన్నది. ఆ రాజు నాకేదైనా హాని తలపెట్ట వచ్చు. నేను తీర్థయాత్రలు చేసుకుంటూ జీవితం ముగిస్తాను," అన్నాడు గుణశర్మ.

"శాస్త్రోక్తంగా అగ్ని కార్యమూ, పితృ కార్యమూ చేసుకోలేని వాళ్ళకే తీర్థ యాత్రలు. నీ కోసం చక్కని పాతాళ గృహం కట్టిస్తాను. నా కుమార్తెను పెళ్ళాడి, నరమానవుడి కంట పడకుండా అందులో సుఖంగా ఉండు," అన్నాడు అగ్నిదత్తుడు.

"సుందరిని పెళ్ళాడమంటే వద్దనేవా డుంటాడా? కాని పెళ్ళి ఇప్పుడు కాదు. నేనే దేవుణ్ణయినా ఆరాధించి, కృతఘ్ను డైన మహాసేనుడికి ప్రాయశ్చిత్తం చేసి ఆ తరవాత పెళ్ళి చేసుకుంటాను," అన్నాడు గుణశర్మ.

అగ్నిదత్తు డతని కొక చక్కని పాతాళ గృహం కట్టించి, అందులో గుణశర్మను ప్రవేశపెట్టి, తన గురువు ఉపదేశించిన కుమారమంత్రాన్ని అతనికి ఉపదేశించాడు.

గుణశర్మ సుందరి చేత సేవలు పొందుతూ, కుమారమంత్రం ఆరాధించి, కుమారస్వామిని ప్రత్యక్షం చేసుకుని, అక్షయ ధనకోశం సంపాదించాడు. తరవాత అతను సుందరిని పెళ్ళాడి సైన్యాలను సమీకరించుకుని, ఉజ్జయినిపై దండెత్తి వెళ్ళి, మహాసేనుణ్ణి జయించి, అశోకవతి దుర్మార్గాన్ని బహిరంగంగా చాటి ఉజ్జయినీ సామ్రాజ్యానికి తానే రాజై, అనేకమంది రాజకుమార్తెలను పెళ్ళాడి, చక్రవర్తిత్వం సంపాదించి సుఖంగా ఉన్నాడు.





# పిల్లమేఘం

త్రిగర్త దేశంలో అందరూ కర్షకులే. ఆ దేశం ఎల్లప్పుడూ పాడిపంటలతో సమృద్ధిగా ఉండేది. అక్కడి ప్రజల సుఖసంతోషాలు పూర్తిగా వానదేవుడి పైనా, అతడు పంపే మేఘాల పైనా ఆధారపడి ఉండేవి.

అయితే త్రిగర్త ప్రజలు ఎందరెందరు దేవుళ్ళనో ఆరాధించేవాళ్ళు గాని వాన దేవుణ్ణీ, మేఘాలనూ ఆరాధించేవారు కారు. కనీసం మేఘాలకు చెయ్యెత్తి దణ్ణం పెట్టి తమ కృతజ్ఞత తెలుపుకునే వారైనా కారు. ఇది చూసి మేఘాలకు కోపం వచ్చేసింది.

మేఘాలన్నీ దూర ప్రాంతాన సమావేశమై, త్రిగర్తదేశం మీద ఒక్క చినుకు కూడా రాల్చకూడదని ఏకగ్రీవంగా తీర్మానించుకున్నాయి.

దాని ఫలితంగా త్రిగర్తదేశానికి ఆ యేడు వర్షాకాలం వచ్చింది గాని వర్షాలు రాలేదు. అక్కడి ప్రజలు కళ్ళు చిల్లులుపడేటట్టు ఆకాశం కేసి తెగ చూశారు. ఎక్కడా ఒక్క చిన్న మబ్బు తునక కూడా లేదు. ప్రజల ఆందోళన అంతా ఇంతా కాదు. వాళ్ళు పడే ఆవేదన చూసి మేఘాలు మహా సంతోషించాయి.

కాని తలవని తలంపుగా ఆ మేఘాల సంతోషాని కొక పెద్ద దెబ్బ తగిలింది. ఒక పిల్లమేఘం ఇతర మేఘాలతో చెప్పకుండా చెయ్యకుండా త్రిగర్తదేశానికి వెళ్ళి అక్కడ ఒక జల్లు కురిసి వచ్చింది.

"అమ్మయ్య, వర్షాలు ఆరంభమయాయి," అనుకుని త్రిగర్త ప్రజలు తాము దాచి ఉంచిన విత్తనాలు చల్లి, నారుమళ్ళు వేసుకున్నారు.

ఈ లోపల పెద్ద మేఘాలు పిల్లమేఘాన్ని నానా చివాట్లూ పెట్టాయి: "ఏమిటి నీ ఉద్దేశం? మేమంతా కలిసి త్రిగర్తులకు వాన బొట్టు లేకుండా చేసి ఏడిపించాలని

తీర్మానించుకుంటే, ఎవరికీ చెప్పకుండా పెట్టకుండా వెళ్ళి వానకురిసి వస్తావా? నీ కేమన్నా బుద్ధివుందా?"

"మీ తెలివి తెల్లారినట్టే ఉంది. నేనొక్క చిన్న జల్లుతో, ఆ త్రిగర్తులు దాచుకున్న విత్తనాలగింజలు కూడా వాళ్ళకు దక్క కుండా నేలపాలు చేయించి వచ్చాను. ఆ సంగతి మీరు గ్రహించటం లేదు," అన్నది పిల్లమేఘం పెద్దమేఘాలతో.

త్రిగర్త దేశప్రజల పరిస్థితి ఇప్ప డెలా ఉన్నదీ చూడటానికి పెద్దమేఘాలు కదిలి వచ్చాయి. ఈలోపుగా జనం తహ తహ లాడి పోతున్నారు. ఒక్క జల్లు పడగానే వానలు ఆరంభమయాయిగదా అనుకుని వాళ్లు దాచుకున్న విత్తనాలను కాస్తా మళ్లలో చల్లేశారు. ఆ తరవాత మళ్ళీ చినుకులేదు. వాళ్ళు అదేపనిగా ఆకాశాని కేసి చూస్తూ, వానదేవుడికీ మేఘాలకూ దణ్ణాలు పెట్టు కుంటూ, ఆక్రోశిస్తున్నారు.

వాళ్ళను చూసేసరికి పెద్దమేఘాలకు ఎక్కడలేని జాలీ పుట్టుకొచ్చింది. అవి పిల్ల మేఘాన్ని, "పెద్దవాళ్ళతో చెప్పకుండా ఇలాటి అల్లరి చిల్లరపను లెన్నడూ చెయ్యకు," అని మందలించి, త్రిగర్త దేశం పైన కుంభపోతగా వర్షించి తమ దారిన తాము వెళ్ళిపోయాయి.

తమ ప్రార్థనలు విని, మొరలాలకించి వర్షం ప్రసాదించినందుకు త్రిగర్త ప్రజలు అదిమొదలు వానదేవుడికి కొలుపులు చేస్తూ వచ్చారు. అక్కడ ఏనాడూ అనావృష్టి లేదు. అది సుక్షేత్రమైన ప్రదేశం.

దీనికంతకూ మూలకారణం పిల్ల మేఘమే నన్నసంగతి పెద్దమేఘాలకు తెలీదు. అది ఆకతాయితనంగా చేసినపని చివరకు మంచికే దారితీసింది. పెద్దమేఘాల చేత తలవాచేటట్టు చివాట్లు తిన్నకారణంగా పిల్లమేఘానికి కూడా తాను ఘనకార్యం చేసిన సంగతి తెలీదు పాపం.






# తిరునాళ్ళ సందడి

సుబ్బారాయుడి కొండ మీద జరిగే ఉత్సవానికి పాపన్న సకుటుంబంగా వెళ్ళాడు. ఉత్తప్పుడా ప్రాంతంలో కుగ్రామాలు తప్ప ఏమీ లేకపోయినా తిరునాళ్ళకు జనం తండోపతండంగా వచ్చి వేడుక చూస్తారు, మొక్కులూ అవీ ఉంటే చెల్లిస్తారు. ఎన్నో అంగళ్ళు పెడతారు. అనేక వేడుకలు జరుగుతాయి.

పాపన్న ఈ ఉత్సవానికి వచ్చి సత్రంలో బస చేశాడు. ఉదయం పూట అతను కాలకృత్యాలు తీర్చుకోవటానికిగాను కొండ పక్కన ప్రవహించే వాగు కేసి వెళ్ళి, స్నానం చేసి, తిరిగివస్తూండగా, ఒక ముసలాయన, "ఇక నడవలేను, సుబ్బారాయుడా!" అంటూ ఒక బండ మీద చతికిలబడ్డాడు. ఆ ముసలాయన పాపన్నకు తెలిసినవాడే.

"ఏం, తాతా?" అంటూ పాపన్న దగ్గిరికి వచ్చేసరికి ముసలాయన తల ఎత్తి చూసి, "పాపన్నవా? సుబ్బారాయుడల్లే వచ్చావు! ఒక్క చిన్న ఉపకారం చేసి పెడుదూ! ఈ డబ్బాలో ముడుపున్నది, దాన్ని కాస్త దేవుడి హుండీలో వేస్తావా? ఎలాగో ఇక్కడిదాకా నడిచి వచ్చానుగాని, కొండ ఎక్కలేను. ఇక్కడే ఉంటాను, కాస్త దేవుడి ప్రసాదం మటుకు తెచ్చి పెట్టు," అన్నాడు.

ముసలాయన తన కింకే సహాయమూ అవసరం లేదనీ, తన వద్ద భోజనపదార్థాలూ అవీ ఉన్నాయనీ అన్నాడు. అందుచేత పాపన్న అయన ఇచ్చిన డబ్బా తీసుకుని కొండదారిన బయలుదేరాడు. దారిలో అతని కొక మూడేళ్ళ పిల్ల కనిపించింది. ఆ పిల్ల "అమ్మా" అని ఏడుస్తూ, పడుతూ లేస్తూ ఉత్సవం దిక్కుగా పోతున్నది.

పాపన్న ఆ పిల్ల నెత్తుకుని, "నీపేరేమిటి? మీవాళ్ళెక్కడ?" అంటూ చుట్టూ



చూశాడు. ఎవరూ దగ్గరలో కనిపించలేదు. ఆ పిల్ల వచ్చీరాని మాటలతో, తన పేరు మాలతి అనీ, ఎవడో దొంగ తన సొమ్ములు కాజేశాడనీ, అమ్మ కావాలనీ అన్నది. పిల్లను చూస్తే ధనికుల బిడ్డగా ఉన్నది. దొంగవా డెవడో పిల్ల ప్రాణాలు తీయకుండా వదిలిపెట్టినందుకు పాపన్న సంతోషించాడు.

పాపన్న మాలతిని ఉత్సవం జరిగేచోటికి తెచ్చి, పిల్ల తాలూకు మనుషులు కనిపిస్తారేమోనని చాలాసేపు తిరిగాడు; పిల్లకు ఒక అరటిపండు కొని, తినటానికి ఇచ్చాడు; రంగులరాట్నం చూసి పిల్ల సంబరపడితే, దాని మీద ఎక్కించి తిప్పాడు. తరవాత పిల్లను ఎత్తుకుని, ముసలాయన ఇచ్చిన ముడుపుడబ్బా కోసం వెతికితే అది కనిపించలేదు.

"పిల్లను రంగులరాట్నం ఎక్కించటానికి వెళుతూ, ఇక్కడ ఒక డబ్బా ఉంచాను. అదేమయిందో తెలుసునా?" అని పాపన్న ఆ చుట్టుపక్కల ఉన్న వాళ్ళను అడిగాడు.

"ఎవరో పెద్దమనిషి, కిందటిసారి రాట్నం ఆగినప్పుడు దాని నుంచి దిగి, వెళ్ళిపోతూ ఇక్కడ ఉన్న డబ్బా తీసుకుని వెళ్ళిపోయాడు. ఆ డబ్బా ఆయనదే కాబోలు ననుకున్నాం," అన్నారు అక్కడి వాళ్ళు. వాళ్ళు ఆ మనిషి ఆనవాళ్ళు కూడా చెప్పారు. ఆయన ఎర్రపాగా తలకు చుట్టుకుని, పచ్చని చొక్కా వేసుకున్నాడు; మనిషికి గడ్డాలూ, మీసాలూ ఉన్నాయి.

పాపన్న మాలతి తల్లిదండ్రుల కోసం వెతికే కళ్ళతోనే, ఎర్రపాగా, పచ్చచొక్కా, గడ్డాలూ, మీసాలూ గల మనిషి కోసం కూడా చూస్తూ చాలాసేపు తిరునాళ్ళ జనం మధ్యగా తిరిగాడు.

అంతలోనే, "మాలతీ!" అని కేక పెడుతూ ఒక స్త్రీ అతన్ని సమీపించి, మాలతిని అతని చేతి నుంచి లాగేసుకున్నది.

"ఈ పిల్ల మీదేనా? మీ కోసం తెగ తిరుగుతున్నాను," అన్నాడు పాపన్న.

ఆ ఇల్లాలు తన పిల్ల ఒళ్ళు తడివి చూసుకుని ఆగ్రహంతో, "పిల్ల నగలన్నీ కాజేసి ఉత్తపిల్ల నిస్తున్నావా?" అన్నది పాపన్నతో.

ఆవిడ తనకు కృతజ్ఞత చూపకపోగా దొంగతనం అంటగట్టటం చూసి పాపన్న, ఆ పిల్ల తన కెలా దొరికినదీ చెప్పాడు. మాలతి కూడా అదే నిజమన్నది. ఆ తల్లి, తన కూతురు ప్రాణాలతో దొరికినదే చాలు ననుకుని, బిడ్డతో సహా వెళ్ళిపోయింది.



పాపన్న కిప్పుడు ముసలాయన ఇచ్చిన ముడుపు డబ్బా దిగులు పట్టుకున్నది. ఆయన తన కోసం వాగు దగ్గిర ఎదురు చూస్తూంటాడు. ఏం చెయ్యటానికీ పాప న్నకు పాలుబోక, తన బసకు వెళ్ళాడు. అతన్ని చూస్తూనే అతని భార్య, "మన పిల్లవా డెక్కడైనా కనిపించాడా? మీరెంత సేపటికీ రాకపోతే ఇద్దరూ కలిసి తిరుగు తున్నారనుకున్నానే?" అన్నది.

"జనంలో తిరుగుతూంటాడు. వాడే వస్తాడులే," అన్నాడు పాపన్న చిరాకుగా.

"కాదండీ, పరిగడుపున ఇంత ఫల హారమన్నా చెయ్యకుండా వెళ్ళాడు. భోజ నాలవేళ కావస్తున్నది. దారితప్పి ఎటైనా పోయాడో ఏమో, వాణ్ణి కాస్త వెతికి తీసుకు రండి," అన్నది భార్య.

"ఇంతసేపూ జనం మధ్యనే తిరుగు తున్నాను. ఒక దొంగవాడి మూలంగా నాకు చెడ్డ చిక్కు వచ్చిపడింది. వాడి కోసం కళ్ళు కాయలయేలా చూశాను. ఇంకేం చూసేది?" అన్నాడు పాపన్న

ఇంతలో పాపన్న కొడుకు, పదేళ్ళవాడు, రొప్పుకుంటూ, "ఏం జరిగిందో తెలుసా, నాన్నా?" అంటూ వచ్చాడు. వాడి చేతిలో ఒక కత్తీ, గడ్డమూ, ఒక డబ్బా ఉన్నాయి. ఆ డబ్బాను చూసేసరికి పాపన్నకు ప్రాణం

లేచి వచ్చింది. అది ముసలాయన ఇచ్చిన ముడుపు డబ్బా.

పాపన్న కొడుకు జరిగిన దంతా తల్లి దండ్రులకు చెప్పాడు.

వాడు ఆ ఉదయం తాము దిగిన సత్రం పరిసరాలలో చెట్ల మీది కోతులను చూసి ఆనందిస్తూ తిరుగుతుండగా, ఎర్ర తలపాగా, పచ్చ చొక్కా, గడ్డాలూ, మీసాలూ గల మనిషి ఒకడు కనపడి, "తింటావా అబ్బాయి?" అంటూ చేతిలో బటానీలు చూపాడు. పాపన్న కొడుకు దగ్గిరికి రాగానే, ఆ మనిషి వాడి చెయ్యి గట్టిగా పట్టుకుని, రెండో చేతితో కత్తి చూపిస్తూ, "అరిచావంటే పొడిచేస్తా! నా వెంట రా!" అంటూ కొండరాళ్ళ మధ్యకు తీసుకుపోయాడు.

అక్కడ ఆ మనిషి తన చేతిలో ఉన్న కత్తి, డబ్బా ఒక రాతి మీద పెట్టి, కుర్రవాడి చెవుల కుండే తమ్మంట్ల సీలలు ఊడదీయటానికి ప్రయత్నించాడు. ఒకటి వచ్చింది గాని రెండోది సులువుగా రాలేదు. ఈ లోపల కుర్రవాడికి ఆ మనిషి గడ్డం పెట్టుడు గడ్డం లాగా కనబడింది. వాడు చల్లగా చెయ్యి చాచి కత్తి అందుకుంటూ, రెండో చేత్తో ఆ మనిషి గడ్డం పట్టుకుని గుంజాడు. గడ్డం చేతిలోకి ఊడి వచ్చింది. దొంగవాడు కంగారుగా లేచి నిలబడ్డాడు.



"దొంగ! దొంగ! పట్టుకోండి!" అని కుర్రాడు కేకలు పెట్టాడు.

దూరంగా మనుషుల మాటలు వినిపించాయి. దొంగ పరిగెత్తసాగాడు. పాపన్న కొడుకు డబ్బా కూడా తీసుకుని దొంగ వెంట పడ్డాడు. కాని దొంగవాడు పెద్దపెద్ద రాళ్ళ మీదుగా దూకుతూ వాగు కేసి కనబడకుండా పారిపోయాడు. పాపన్న కొడుకు బస చేరుకున్నాడు.

తన కొడుకు ధైర్యానికీ, యుక్తికీ పాపన్న చాలా సంతోషించాడు. వాళ్ళంతా ఆ పూటే కొండ మీదికి వెళ్ళి, దేవుడి దర్శనం చేసుకున్నారు. పాపన్న, ముసలాయన ముడుపును దేవుడి హుండీలో వేశాడు.

తరవాత పాపన్న ముసలాయన ఉన్న చోటికి బయలుదేరుతుంటే అతని కొడుకు కూడా బయలుదేరాడు. ఇద్దరూ వాగు ప్రాంతం చేరేసరికి ముసలాయన సమీపంలో ఇంకో మనిషి పడుకుని ఉన్నాడు.

"ఎవరు, తాతా, ఈ మనిషి?" అని పాపన్న అడిగాడు, ముసలాయనకు ఖాళీ డబ్బా తిరిగి ఇస్తూ.

"ఎవరో, పాపం! కాలులో ఇంత లోతున ఏదో మోడు దిగబడిందట. నడవలేక ఇక్కడ చతికిలబడ్డాడు," అన్నాడు ముసలాయన.

ఈ మాటలు విని పడుకుని ఉన్న మనిషి లేచి కూర్చుని, పాపన్న కొడుకును చూసి కంగారు పడ్డాడు.

"వీడే నాన్నా, దొంగ!" అన్నాడు పాపన్న కొడుకు తండ్రితో.

దొంగ పారిపోదామని చూశాడు గాని కాలు బాధపెట్టటం చేత పరిగెత్తలేక పోయాడు. పాపన్న వాణ్ణి సులువుగా పట్టుకుని వెతకగా వాడు కాజేసిన తమ్మంటు దొరికింది. పాపన్న ఆ దొంగను గ్రామాధికారికి అప్పగించి, యాత్ర ముగించుకుని, సకుటుంబంగా తన గ్రామానికి తిరిగి వెళ్ళిపోయాడు.





# కొరగాని న్యాయపీఠం

కుందన పురాన్ని ఏలే చందన రాజుకు న్యాయం నూటికినూరు పాళ్ళూ అమలు జరగాలన్న ఉద్దేశం ఉండేది. సాధారణంగా అది సాధ్యపడదు. ఎందుచేతనంటే, న్యాయ నిర్ణయం చెయ్యవలిసిన వాళ్ళు మానవమాత్రులు, వాళ్ళు పొరపడే అవకాశాలు ఎన్నయినా ఉంటాయి; అందువల్ల న్యాయ లోపం జరగక తప్పదు.

ఈ లోపం జరగకుండా ఉండటానికిగాను చందనరాజు అరణ్యానికి పోయి ధర్మదేవతను గురించి ఎంతోకాలం తీవ్రమైన తపస్సు చేశాడు.

ధర్మదేవత ఆ తపస్సుకు మెచ్చి, రాజును ఏం కావాలో కోరుకోమన్నాడు. తన కొక న్యాయపీఠాన్ని అనుగ్రహించమనీ, దాని మీద నిలబడి ఎవరైనా అబద్ధం ఆడితే వారికి ఘోరమైన వికారాకారం రావాలనీ రాజు కోరాడు.

ధర్మదేవత రాజుకు అలాటి న్యాయపీఠాన్ని ఇచ్చి అంతర్ధానమయాడు. రాజు దాన్ని మేళతాళాలతో తెచ్చి తన సభలో ఏర్పాటు చేసి, దాని మహిమ అందరికీ వెల్లడించాడు.

అప్పటికీ న్యాయపీఠం యొక్క మహిమలో నమ్మకం లేని వాళ్ళు దాని పైన నిలబడి అబద్ధాలు చెప్పి, వికారాకారాలు పొందాక అందరికీ దానిలో గురి కుదిరింది. రాజు న్యాయాన్ని నాలుగు పాదాల మీద నిలబెట్టగలిగా ననిపించుకున్నాడు. రాజుకు ఎక్కడలేని తృప్తి కలిగింది.

"నే నిప్పుడు కళ్ళు మూసుకుని నిశ్చింతగా న్యాయ నిర్ణయం చెయ్యగలను. నా న్యాయపీఠం ఉండగా నా పరిపాలనలో అన్యాయం జరగటానికి వీల్లేదు," అని రాజు మంత్రి సామంతులున్న సభలో ఒకసారి ప్రగల్భాలు పలికాడు.

రవిరామ్

ఆ మాటలు విని మంత్రి పెద్దగా నవ్వి, "మహారాజా, న్యాయపీఠాన్ని అలా గుడ్డిగా నమ్మటం అంత మంచిది కాదు. దీన్ని వంచించి ఎవరైనా అన్యాయం చెయ్య వచ్చు," అన్నాడు.

రాజుకు ఆగ్రహం వచ్చింది. "న్యాయ పీఠాన్ని అలా అనటం కంటె అత్యాచారం ఉండదు. దాన్ని వంచించి అన్యాయం చెయ్యవచ్చునని మూడు రోజుల లోగా అందరి ఎదటా రుజువు చెయ్యలేకపోతే నీ తల తీయించేస్తాను," అని ఆయన మంత్రితో అన్నాడు.

కుందనపురంలో హేమకురంగి అనే అందమైన వేశ్య ఉండేది. తన వంటి సౌందర్యవతి ప్రపంచంలో లేదన్న గర్వాతిశయంతో ఆమె అందరినీ అవమానిస్తూ ఉండేది. రాజుకూ ఆ వేశ్యకూ కూడా ఒకే సారి గుణపాఠం నేర్పాలని మంత్రి సంకల్పించాడు.

ఆయన ఒక యోగి లాగా వేషం వేసుకుని హేమకురంగి ఇంటి కెదురుగా తిష్ఠ వేసి, దారే పొయ్యేవాళ్ళ దగ్గిర డబ్బూ, బంగారమూ తీసుకుని వాళ్ళిచ్చిన దానికి రెట్టింపు ఇచ్చి పంపనారంభించాడు. యోగి చేస్తున్నపని చూసిన మీదట హేమకురంగికి



లోభం పుట్టుకొచ్చి, రాత్రి వేళ ఎవరూ చూడకుండా ఆయన వద్దకు వచ్చి, తన వద్ద ఉన్న బంగారమూ, రత్నాలూ తెచ్చి ఇచ్చి, దాన్ని రెట్టింపు చేసి ఇవ్వమని వేడుకున్నది. రేపుదయం ఇస్తానని యోగి ఆమెను పంపేసి, ఆమె ఇచ్చిన బంగారాన్నీ, రత్నాలనూ తన దండంలో ఉండే డొలుపులో దాచిపెట్టేశాడు.

యోగి రాత్రికి రాత్రే ఎటైనా పారిపోకుండా చూస్తూ ఉండటానికి తన నౌకర్లను నియోగించి, హేమకురంగి మర్నాడు ఉదయమే వచ్చి, తన సొత్తు రెట్టింపు చేసి ఇవ్వమన్నది.

"నీ సొత్తేమీ నా దగ్గిర లేదే!" అన్నాడు యోగి ఆశ్చర్యం నటిస్తూ.

హేమకురంగికి కోపమూ, దుఃఖమూ ముంచుకొచ్చాయి. యోగి కదా అని తన కున్నదంతా ఇచ్చేస్తే అంతా కాజెయ్యాలని చూస్తున్నాడు! రాజుగారితో ఫిర్యాదు చెయ్యటానికి ఆమె యోగిని రాజుగారి దగ్గిరికి రమ్మన్నది. యోగి అందు కెలాంటి అభ్యంతరమూ చెప్పలేదు.

హేమకురంగి చేసిన ఫిర్యాదు విని రాజు యోగిని న్యాయపీఠం మీద నిలబడి జవాబు చెప్పమన్నాడు. యోగి తన దండాన్ని పట్టుకోమని హేమకురంగి కిచ్చి, న్యాయపీఠం ఎక్కి, "ఈ హేమకురంగి సొత్తు నా వద్ద చిల్లిగవ్వ కూడా లేదు," అని చెప్పి, చెక్కుచెదరకుండా న్యాయపీఠం నుంచి దిగి వచ్చాడు.

ఇంత దారుణమైన అబద్ధాన్ని విని హేమకురంగి ఆగ్రహావేశంలో ఆ దండాన్ని తన చేతిలో పట్టుకునే న్యాయపీఠం ఎక్కి, "నా బంగారమూ, రత్నాలూ ఈ యోగి కిచ్చాను. దాన్ని నా కీ దొంగవాడు తిరిగి ఇవ్వనేలేదు," అని గట్టిగా అరిచింది. ఆమె మాట పూర్తి కాకుండానే ఆమె రూపం వికారంగా మారిపోయింది. సభలో వున్న వాళ్ళందరూ నవ్వారు.

మంత్రి తన వేషాన్ని విప్పేసి, రాజుకు జరిగిన దంతా చెప్పి, "చూశారు గదా, మీ న్యాయపీఠం ఈ హేమకురంగికి చేసిన అన్యాయం?" అన్నాడు.

హేమకురంగి బుద్ధిపూర్వకంగా అబద్ధం ఆడలేదు; తన చేతిలో ఉన్న దండంలో తన సొత్తు ఉన్నదన్న మాట ఆమెకు ఏమాత్రమూ తెలియదు. అయినా ఆమె కురూపి అయిపోయింది.

ఈ సంఘటనతో రాజుకు న్యాయపీఠం మీద విరక్తి పుట్టి, దాన్ని న్యాయస్థానంలో నుంచి తీయించేశాడు.





# ఉత్తర కాండ

అగస్త్యుడు రాముడికి వాలి సుగ్రీవుల కథ ఇలా చెప్పాడు:

మేరుపర్వతం మీది మధ్య శిఖరం దేవతలకు కూడా పవిత్రమైనది. దాని మీద విశాలమైన బ్రహ్మసభ ఉన్నది.

ఒకసారి బ్రహ్మ యోగాభ్యాసం చేస్తూ, కంటి నుండి కారిన నీటిని విదిల్చేసరికి, దాని నుంచి ఒక వానరుడు పుట్టాడు. బ్రహ్మ ఆ వానరుణ్ణి కొంత కాలంపాటు తన వద్దనే ఉండమనీ, మేరుపర్వతం మీది దుంపలూ, పళ్ళూ తింటూ ఉండమనీ అన్నాడు. అది మొదలు ఆ వానరుడు పగలల్లా చెట్ల మీద సంచరించి, సాయంకాలం కాగానే మంచి మంచి పూలూ, పళ్ళూ తీసుకుని బ్రహ్మ వద్దకు వస్తూండేవాడు.

ఇలా చాలా కాలం గడిచింది. ఒకనాడా వానరుడికి దాహం కలిగింది. అతను మేరుపర్వతం యొక్క ఉత్తర శిఖరానికి వెళ్ళాడు. అక్కడ అనేక పక్షులతో కూడిన సరస్సొకటి కనిపించింది. వానరుడు తన శరీర మంతా ఒక్కసారి విదుల్చుకుని, నీటి దగ్గిర కూర్చుని, తన దాహం తీర్చుకునేటందుకుగాను నీటిలోకి తొంగి చూసేసరికి, అందులో అతని ప్రతిబింబం కనిపించింది. నీటిలో తన శత్రువైన మరొక వానరుడు దాగి ఉన్నాడనీ, వాడి అంతు కనుక్కోవాలనీ అనుకుని వానరుడు నీటిలోకి చెంగున దూకి, ఎంతో వెతికాడు. లోపల మరొక వానరుడు కనిపించకపోయేసరికి అతను ఒడ్డుకు తిరిగి వచ్చాడు.



ఒడ్డుకు చేరుతూనే ఆ వానరుడు ఒక అందమైన ఆడదిగా మారిపోయాడు. జగన్మోహనమైన రూపంతో ఆ ఆడది అక్కడే కూర్చుని ఉండగా, ఇంద్రుడూ, సూర్యుడూ బ్రహ్మను చూసి వెళ్ళిపోతూ అటుగా వచ్చారు. ఇద్దరి కళ్ళూ ఒకసారే ఆమె పైన పడ్డాయి. ఇద్దరికీ ఆమె పైన మోహం కలిగింది. వారిద్దరి వల్లా ఆమె గర్భవతి అయి, వాలి సుగ్రీవులను కన్నది. ఇంద్రుడు తన కొడుకైన వాలికి బంగారు తామరల మాలను కానుకగా ఇచ్చాడు. సూర్యుడు తన కొడుకైన సుగ్రీవుడికి హనుమంతుణ్ణి స్నేహితుడుగా నిరూపించాడు.



తరవాత ఆ వానరుడికి స్త్రీ రూపం పోయి తిరిగి మామూలు రూపం వచ్చేసింది. అతనే తన కొడుకు లిద్దరినీ పెంచాడు. అతనే ఋక్షరజసుడు. బ్రహ్మదేవుని ఆజ్ఞ పైన ఋక్షరజసుడు తన కొడుకు లిద్దరినీ తీసుకుని వానరుల నగరమైన కిష్కింధకు వెళ్ళాడు. అక్కడ అతను రాజ్యాభిషేకం చేసుకుని, సప్తద్వీపాలలోనూ ఉండే వానరుల కందరికీ రాజయాడు.

“రామా, వాలి సుగ్రీవులకు తండ్రీ, తల్లీ కూడా ఋక్షరజసుడే,” అని చెప్పి అగస్త్యుడు ఆ కథ ముగించాడు.

రామపట్టాభిషేకం జరిగాక చాలా రోజులపాటు వచ్చినవా రందరికీ సుఖంగా గడిచింది. అనంతరం ఒకరొకరే వెళ్ళిపోసాగారు. రాముడు అందరికీ తన కృతజ్ఞత తెలుపుకుని, తగిన విధంగా సత్కరించి సాగనంపాడు. భరతుడు వెంట రాగా జనక మహారాజూ, లక్ష్మణుణ్ణి వెంటబెట్టుకుని కేకయమహారాజూ వెళ్ళిపోయారు. భరతుడి ఆహ్వానం పైన వచ్చిన కాశీరాజు ప్రతర్దనుడూ ఇతర రాజులూ కూడా తమ తమ దేశాలకు తిరిగి వెళ్ళారు.

రాముడి వెంట వచ్చిన వానరులూ, రాక్షసులూ రెండు నెలలపాటు అయోధ్యలో







సుఖంగా గడిపి వారు కూడా బయలు దేరారు. తనకు యుద్ధంలో తోడ్పడిన సుగ్రీవాంగద హనుమంతాదులను రాముడు చక్కగా సత్కరించాడు, అలాగే విభీష ణుడికీ, అతని రాక్షసులకూ సన్మానాలు చేశాడు. వారందరూ బయలుదేరి కిష్కిం ధకూ, లంకకూ వెళ్ళిపోయారు.

తరవాత రాముడు సీతతో వనవిహా రాలు చేస్తూ, మిత్రులతో గోష్ఠి జరుపుతూ కాలక్షేపం చేస్తూ వచ్చాడు. సీతలో గర్భ చిహ్నాలు కనిపించాయి. రాము డామెతో, "సీతా, గర్భిణివిగా ఉన్నావు గదా, నీ కేమైనా కోరిక లుంటే చెప్పు, తీరుస్తాను," అని ఒకనా డన్నాడు.

సీత చిరునవ్వుతో ముఖం పంచుకుని, "నాకు గంగాతీరాన ఋషుల ఆశ్రమాలు చూసి, వారి కందమూల ఫలాలు తిని, అక్కడి చెట్ల కింద విహరించాలని ఉన్నది," అన్నది.

రాముడు, "అలాగే చేతువుగాని, రేపే నిన్ను అక్కడికి పంపుతాను," అన్నాడు.

సీతతో ఈ మాట అని అతను తన మిత్రుల మధ్యకు వచ్చి హాస్యపు కథలు చెప్పుకుంటూ కూర్చుని, భద్రుడనే వాణ్ణి చూసి, "అయితే, భద్రా, నన్ను గురించీ, సీత గురించీ, నా తల్లులను గురించీ, తమ్ములను గురించీ ప్రజలు ఏమను కుంటూంటారు?" అని అడిగాడు.

భద్రుడు చేతులు జోడించి, "ప్రజలు అనేక రకాలగా చెప్పుకుంటారు. వాళ్ళు జాస్తిగా మాట్లాడుకునేది రావణసంహారం గురించి," అన్నాడు.

భద్రు డేదో దాస్తున్నాడని రాముడికి అనుమానం వేసింది. "భద్రా, ఉన్నమాట చెప్పు. మంచిదయినా, చెడ్డదయినా దాచకు," అన్నా డతను.

"సముద్రానికి సేతువు కట్టావనీ, రావ ణుణ్ణి సమూలంగా నాశనం చేశావనీ



రాముడు లోపల తీవ్రంగా బాధపడుతూ మిగిలిన మిత్రులతో, "ఈ మాట నిజమేనా?" అన్నాడు.

అందరూ తలలు వంచుకుని, నిజమేనని చెప్పారు.

రాముడు వారందరినీ పంపేసి, సమీపంలో ఉన్న ద్వారపాలకుణ్ణి పిలిచి, "లక్ష్మణుణ్ణీ, భరతశత్రుఘ్నులనూ పిలుచుకురా," అన్నాడు. త్వరలోనే వారు ముగ్గురూ రాముడి వద్దకు వచ్చారు. కాంతి లేని ముఖంతో, కన్నుల నీరు కారుస్తూ రాముడు తన తమ్ములను ఆలింగనం చేసుకుని, ఆసనాల మీద కూర్చోబెట్టి, వారికి సీత గురించి తాను పొందిన జనాపవాదం గురించి తెలిపాడు.

"సీత నిర్దోషురాలని అగ్ని ఇతర దేవతలూ చెప్పారు. నా అంతరాత్మలో కూడా అలాగే అనిపించింది. లక్ష్మణా, అది నీ ఎదటే గదా జరిగింది? అందుచేతనే సీతను అయోధ్యకు తెచ్చాను. కాని ఈ అపవాదు భరించటం చాలా బాధగా ఉంది. ప్రాణాలనూ మిమ్మల్నీ అయినా వదులుతాను గాని అపకీర్తిని సహించలేను. సీతను విడవటమనగా ఎంత? ఈ అపవాదును మించిన దుఃఖం నా కుండబోదు. అందు

ప్రజలు నిన్ను గురించి గొప్పగా చెప్పుకుంటారు. నిన్ను చూసి చాలా గర్వపడతారుకూడా. కాని రావణుడు తన ఒడిలో కూర్చోబెట్టుకుని లంకకు తీసుకుపోయి, అంతకాలం తన ఆధీనంలో ఉంచుకున్న సీతను మళ్ళీ తెచ్చుకున్న నీకు మంచి చెడ్డలు తెలియ వంటున్నారు. రేపు తమ భార్యల కేమైనా జరిగినా తాము చచ్చినట్టు భరించవలిసిందే గదా అంటున్నారు. యథారాజా తథాప్రజా అన్నారు గద. ఎక్కడికి పోయినా జనం గుంపులు గుంపులుగా కూడి ఈ మాటలే చెప్పుకుంటున్నారు," అన్నాడు భద్రుడు.

చేత, లక్ష్మణా, రేపు తెల్లవారుజామున సీతను రథం మీద తమసానదీ తీరాన, వాల్మీకి ఆశ్రమప్రాంతంలో అరణ్యంలో వదిలిపెట్టిరా. నా మాటకు ఎదురు చెప్పకు, సీతను గురించి ఏమీ అనకు. అంటే నా పైన ఒట్టే! సీత ఋషుల ఆశ్రమాలను చూడాలని కోరింది. ఆ కోరిక తీరుతుంది," అన్నాడు రాముడు.

ఈ మాటలు చెప్పి అతను బాధగా నిట్టూర్పులు విడుస్తూ అంతఃపురంలో వెళ్ళిపోయాడు.

మర్నాడు తెల్లవారుతూనే లక్ష్మణుడు సుమంత్రుడి వద్దకు వెళ్ళాడు. అతని వాలకం దీనంగా ఉన్నది, నోరెండిపో తున్నది. అతను సుమంత్రుడితో, "సీతను మునుల ఆశ్రమాలకు తీసుకుపొమ్మని రాముడి ఆజ్ఞ అయింది. నేనూ, సీతా ఇప్పుడే బయలుదేరుతున్నాం. వెంటనే రథం సిద్ధం చెయ్యి. సీత కోసం రాజ భవనం నుంచి మెత్తని ఆసనం తెచ్చి రథంలో అమర్చు," అన్నాడు.

సుమంత్రుడు రథాన్ని అయత్తం చేసి తేగానే లక్ష్మణుడు సీత వద్దకు వెళ్ళి, "అమ్మా, ఆశ్రమాలు చూడాలని ఉన్నట్టు రాజుగారితో అన్నావుట. రాజుగారి ఆజ్ఞ



అయింది. గంగా తీరాన గల ఆశ్రమాలకు పోదాం, బయలుదేరు. మా అన్న ఆజ్ఞ ప్రకారం నేను కూడా నీ వెంట వస్తున్నాను," అన్నాడు.

సీత ఈ మాటలకు పరమానందం చెంది, వెలగల బట్టలూ, రత్నాలూ, ఆభరణాలూ మునిపత్నుల కోసం తీసుకుని, లక్ష్మణుడి వెంట రథం మీద బయలుదేరింది. రథం వేగంగా పోతూంటే సీతకు దుశ్శకునాలు కనిపించాయి. ఆ సంగతి లక్ష్మణుడితో చెప్పి, "అత్తలూ వాళ్ళూ క్షేమంగా ఉన్నారు కద!" అన్నది. లోపల గుండె గుబగుబలాడుతున్నప్పటికీ, లక్ష్మ





ణుడు పైకి నవ్వుతూ, "వారంతా క్షేమంగానే ఉన్నారు," అన్నాడు.

రాత్రి అయే సరికి రథం గోమతీతీర్థం చేరింది. ఆ రాత్రి అక్కడ గడిపి, తెల్లవారి బయలుదేరి, మధ్యాహ్నాని కల్లా గంగా తీరానికి చేరుకున్నారు. గంగను చూడగానే లక్ష్మణుడికి దుఃఖం ఆగలేదు. అది చూసి, "ఇదేమిటి, లక్ష్మణా? ఎందు కేడుస్తున్నావు? ఎంతో కాలంగా కోరుకున్న నా కోరిక తీరిందని నేను సంతోషిస్తుంటే, నీ దుఃఖంతో నా ఆనందాన్ని పాడుచేస్తున్నావెందుకు? నన్ను వేగంగా గంగ దాటించి మునుల ఆశ్రమాలకు తీసుకుపో. మునుల భార్యలకు ఈ కానుకలన్నీ ఇస్తాను. అక్కడ ఈ రాత్రి గడిపి, రేపుదయం అయోధ్యకు తిరిగి పోదాం. రాముణ్ణి ఎప్పుడు మళ్ళీ చూస్తానా అని నాకూ తహతహగానే ఉన్నది," అని సీత అన్నది.

లక్ష్మణుడు కళ్ళు తుడుచుకుని దగ్గిరలో ఉన్న పడవ వాళ్ళను పిలిచి, పడవ ఏర్పాటు చేసి, దాని మీద సీతతో సహా గంగ దాటాడు. రథంతో సహా సుమంత్రుడు ఇవతలి ఒడ్డునే ఉండిపోయాడు.

అవతలి ఒడ్డు చేరాక లక్ష్మణుడు సీతకు చేతులు జోడించి నమస్కారం చేస్తూ, "సీతా, మా అన్న నా గుండెలో శూలం గుచ్చేశాడు. ఇంత పాపిష్టి పని చేసే కన్న నేను చచ్చిపోయినా బాగుండిపోను," అంటూ దుఃఖవివశుడై కూలబడిపోయాడు.

సీత అతని స్థితి చూసి కంగారు పడి, "లక్ష్మణా, నీ మాటలు నా కేమీ అర్థం కావటం లేదు. నువ్వేదో ఉద్రేకంలో ఉన్నట్టున్నావు. నీ బాధకు కారణ మేమిటో కాస్త స్పష్టంగా చెప్పు. లేకపోతే మీ అన్న మీద ఒట్టే!" అన్నది.

అప్పుడు లక్ష్మణుడు సీతతో, "అమ్మా, మా అన్న స్నేహితులతో కబుర్లు చెబుతూ నిన్ను గురించి భయంకరమైన లోకాపవాదు



విన్నాడు. ఆ అపవాదు నీ చెవుల పడరానిది. దానితో మా అన్న కుమిలిపోయి నిన్ను వదిలిపెట్టేశాడు. నీ వల్ల ఏ దోషమూ లేదని మా అన్నకూ తెలుసు, నాకూ తెలుసు. అయినా అపవాదుకు వెరచి ఇలా చేశాడు. నిన్నిక్కడే విడిచిపెట్టి నేను అయోధ్యకు తిరిగి వెళ్ళాలి. ఇది రాజాజ్ఞ. నువు మనస్సును అధికంగా కష్టపెట్టుకోక, పుణ్యప్రద మైన ఈ ముని ఆశ్రమాలలో ఉండు. వాల్మీకిమహాముని మా తండ్రికి ఆప్తస్నేహితుడు. ఆయనను ఆశ్రయించి సుఖంగా ఉండు," అన్నాడు.

ఈ మాటలు విని సీత ఒక్క క్షణం పాటు దిమ్మరపోయిన ట్టయింది. తరవాత ఆమె తెప్పరిల్లి, దీనంగా ఏడుస్తూ, "లక్ష్మణా, నేను కష్టాలు పడటానికే పుట్టాను. పూర్వజన్మలో ఏదో పాపం చేసి ఉంటాను, ఏ దంపతులకో ఎడబాటు కలిగించి ఉంటాను. అరణ్యవాస మప్పుడు, రాముడు దగ్గిర ఉండి నన్ను ఓదార్చుతున్నా, నేను దుఃఖిస్తూనే ఉండేదాన్ని; అలాటిది రాముడు వెంట లేని ఈ అరణ్యవాసం ఎలా ఉంటుందో ఆలోచించు. నా దుఃఖం ఎవరితో చెప్పుకునేది? నిన్ను నీ భర్త ఎందుకు వదిలేశాడని మునులు అడిగితే ఏం చెప్పను? ఈ గంగానదిలో పడి చావవచ్చు, కాని అందువల్ల మీ వంశం అపహాస్యంపాలు కావచ్చు. మీ అన్నగారి ఆజ్ఞ నిర్వర్తించావు, ఇక నువు వెళ్ళు, నాయనా. అత్త లందరికీ నా నమస్కారాలు చెప్పు, రాజుగారి క్షేమ మడిగాననీ, ఆయనకు సాష్టాంగ నమస్కారాలు చేశాననీ చెప్పు. ఆయనకు వచ్చిన అపవాదును పోగొట్టటం నా విధి. ధర్మంగా రాజ్యపాలన చేస్తూ, తమ్ముళ్ళనూ, ప్రజలనూ ఒకే విధంగా చూస్తూ, లోకంలో సాటిలేని కీర్తి సంపాదించమని కోరానని ఆయనతో చెప్పు," అన్నది.






బిందురథు డనే రాజుకు సునీతీ, సుమతీ అనే ఇద్దరు కొడుకులూ, ముదావతి అనే ఒక కుమార్తె ఉండేవారు. ముదావతి చాలా అందమైనదే గాక, సంగీత సాహిత్య కళలలో ప్రవీణురాలు

ఒకనాడు బిందురథుడు వేట నిమిత్తం అరణ్యానికి వెళ్ళి, మృగాలను వేటాడుతూ, అరణ్య మధ్యంలో ఒక మహాబిలం ఉండటం చూశాడు. అది చాలా వెడల్పుగానూ, చాలా లోతుగానూ ఉన్నట్టు కనబడింది. దాని విషయం ఎవరినన్నా అడిగి తెలుసుకుందామనుకుంటూండగా ఒక ఋషి అటుగా వచ్చాడు. రాజు ఆ ఋషికి నమస్కరించి, తనను పరిచయం చేసుకుని, "స్వామీ, ఈ బిలం ఎలా ఏర్పడింది? దీని కథ ఏమిటి?" అని అడిగాడు.

"రాజా, ఈ బిలం పాతాళం దాకా పోతుంది. అందులో ఒక రాక్షసు డున్నాడు. వాడి పేరు కుజుంభుడు. వాడు తన నగరం నుంచి ఈ బిలం కుండానే భూమి మీదికి వస్తూ ఉంటాడు. వాడి వద్ద సునంద అనే ముసలం ఉన్నది. దాని సహాయంతో వాడు ఎవరినైనా జయించగలడు. ఆ ముసలాన్ని విశ్వకర్మ తయారుచెయ్యగా, ఈ కుజుంభుడు దాన్ని దొంగిలించాడు. అది తెలిసి విశ్వకర్మ, ఆ ముసలాన్ని స్త్రీ తాకితే దాని శక్తి నశిస్తుందని శాపం ఇచ్చాడు. ఆ సంగతి కుజుంభుడికి తెలియదు. వాడా ముసలం తోనే ఈ బిలాన్ని తవ్వాడు. వాడు మహా భయంకరుడు. అందుచేత నీ వీ ప్రాంతంలో ఉండటం అంత క్షేమం కాదు," అని ఋషి రాజుతో అని వెళ్ళిపోయాడు.

తరవాత బిందురథుడు వేట చాలించి తన నగరుకు వెళ్ళిపోయి, కుజుంభుణ్ణి గురించి తాను విన్నదంతా తన కుటుంబానికీ, తన కింది ఉద్యోగులకూ చెప్పాడు.

అట్ట చివరి బొమ్మ



కొన్ని రోజుల అనంతరం ముదావతి తన చెలికత్తెలతో ఒకనాటి సాయంకాలం ఉద్యానవన విహారం చేస్తూండగా, దోవ తప్పించి అటుగా వచ్చిన కుజుంభుడు రాజకుమార్తె చక్కదనం చూసి, బలవంతాన ఆమెను పట్టుకుని, బిల మార్గాన తన నగరుకు తీసుకుపోయాడు. ముదావతి చెలికత్తెలు గొల్లున గోలపెడుతూ వెళ్ళి రాజుగారికి జరిగిన సంగతి తెలియబరిచారు.

రాజుతో బాటు మంత్రి పురోహితులు మొదలైనవారంతా పుట్టెడు విచారంలో మునిగిపోయి, రాకసుణ్ణి జయించట మెలాగా అని ఆలోచన చేశారు. అప్పుడు సునీతి, సుమతులు తాము వెళ్ళి రాకసుణ్ణి చంపి తమ చెల్లెలిని తెస్తామని తండ్రితో అన్నారు. తండ్రి అనుమతించాడు.

రాకసుడు తనను పట్టుకోగానే ముదావతి మొదట భయపడి వ్యాకులం చెందింది, కాని తరవాత ఆమె ధైర్యం తెచ్చుకుని, రాకసుడికి ఎదురు తిరగటానికి బదులు వాణ్ణి మంచిగానే వంచన చెయ్యాలని నిశ్చయించుకున్నది.

కుజుంభుడు ముదావతిని తన మందిరానికి చేర్చి, ఆమెకు తాగటానికి మంచి పానీయాలిచ్చి, "నువు ఎవరి కుమార్తెవు? నీ పేరేమిటి?" అని అడిగాడు. తాను బిందురథుడి కుమార్తెననీ, తన పేరు ముదావతి అనీ చెప్పిన మీదట వాడు, "నీ అందం చూసి నిన్ను మోహించి తెచ్చాను. నన్ను సుఖపెట్టు," అన్నాడు.

"అంతకన్న కావలిసిం దేమిటి? నా తల్లిదండ్రులు నన్ను మహా పరాక్రమవంతుడికిచ్చి పెళ్ళి చెయ్యాలనుకుని, నీకన్న పరాక్రమవంతులు లేరని నిశ్చయించారు. నేను క్షత్రియకన్యను గనక మనకు శాస్త్రోక్తంగా పెళ్ళి జరిగే వరకూ కాస్త ఓపిక పట్టు," అన్నది ముదావతి. అందుకు రాకసుడు సరే నన్నాడు.



కాని ఆ మర్నాడే సునీతి సుమతులు తన పైకి యుద్ధానికి వచ్చేసరికి రాక్షసుడు ముదావతితో, "మీ వాళ్ళు నిన్ను నాకిచ్చి పెళ్ళిచేస్తా రంటివే, నీ అన్నలు నా పైకి యుద్ధానికి వచ్చారేమిటి?" అన్నాడు.

"నన్ను నువు చెప్పకుండా ఎత్తుకు వచ్చావు గద. అందుకని వాళ్ళకు పౌరుషం వచ్చి ఉంటుంది. వాళ్ళతో నీకు యుద్ధమేమిటి? పట్టుకుని బంధించు," అన్నది ముదావతి.

ఈ మాటలకు రాక్షసుడు సంతోషించి, మాయోపాయం చేత సునీతినీ, సుమతినీ పట్టుకుని, ఖైదుచేశాడు. వారి పరివారంలో వాళ్ళు తిరిగి వెళ్ళి, రాజకుమారులు రాక్షసుడికి బందీలయారని రాజుతో చెప్పారు.

బిందురథ మహారాజు రాక్షసుణ్ణి గెలవటానికి చిన్న చిన్న యత్నాలు పనికిరావని నిశ్చయించుకుని, నానా దేశాల రాజులను పిలిపించి సభ చేసి, కుజుంభుడు తన కుమార్తెను ఎత్తుకు పోవటమూ, ఆమెను విడిపించ బోయిన తన కుమారులను ఖైదు చెయ్యటమూ చెప్పి, "నా కుమార్తెను విడిపించి తెచ్చిన వారికి ఆమెనిచ్చి పెళ్ళి చేస్తానని ప్రమాణం చేస్తున్నాను," అని ప్రకటించాడు.



ఆ సభకు వచ్చిన వారిలో ఖనందు డనే రాజు కొడుకు వత్సంధ్రు డనే వాడున్నాడు. అతను తన తండ్రితో, "నాన్నా, నాకు సెలవిస్తే నేను వెళ్ళి, ఆ రాక్షసుణ్ణి జయించి, బిందురథుడి కుమార్తెను విడిపించి తెస్తాను," అన్నాడు.

ఖనందుడు, "అలాగే వెళ్ళు, కాని జాగ్రత్త! ఆ రాక్షసుడు చాలా బలవంతుడు. వాణ్ణి గెలవటానికి దైవసహాయం అవసరం. అందుచేత, మన వంశానికి మూల పురుషుడైన సూర్యభగవానుడి అనుగ్రహం పొంది, ఆ తరవాత రాక్షసుడి పైకి వెళ్ళు," అని సలహాయిచ్చాడు.

వత్సంద్రుడు సూర్యుణ్ణి ధ్యానించి, తన సైన్యాన్ని వెంట బెట్టుకుని బిందురథ మహా రాజు వద్దకు వెళ్ళి, తాను రాక్షసుడి పైకి యుద్ధానికి వెళుతున్నానని చెప్పి, అయన ఆశీర్వాదం పొంది, కుజుంభుడి నగరానికి చేరుకున్నాడు.

తన పైకి ఎవరో పెద్ద సేనతో యుద్ధానికి వచ్చేసరికి కుజుంభుడు మండిపడి, తన ముసలం తీసుకుని శత్రువును ఎదుర్కొనే టందుకు బయలుదేరుతూ ముదావతికి ఆ సంగతి చెప్పాడు.

"నువు అంత పెద్ద సేన మీదికి యుద్ధా నికి పోవద్దు. ఏమైనా అపాయం కలగ వచ్చు," అన్నది ముదావతి.

"వెర్రిదానా, ఈ ముసలం నా చేతిలో ఉండగా త్రిమూర్తులు కూడా నన్ను జయించలేరు," అంటూ రాక్షసు డామెకు ఆ ముసలం మహిమ చెప్పి, దాన్ని తానెలా సంపాదించిందీ కూడా చెప్పాడు.

ముదావతి ఆ ముసలాన్ని తన చేతిలోకి తీసుకుని, దాన్ని నిమిరి చూసి, "ఇంత ఆయుధం ఉండగా ఇంకేం భయం?" అంటూ దాన్ని వాడి కిచ్చి యుద్ధానికి పంపింది. ఆమె తాకటం చేత విశ్వకర్మ శాపం తగిలి ఆ ముసలం యొక్క శక్తి కాస్తా హరించింది. కుజుంభుడు వత్సం ద్రుడి పైకి యుద్ధానికి వెళ్ళి, అతని చేతిలో అవలీలగా చచ్చాడు.

తరవాత వత్సంద్రుడు సునీతి సుమతు లను చెర విడిపించి, ముదావతిని వెంట బెట్టుకుని తిరిగి వచ్చాడు.

బిందురథుడు అతనికి ముదావతి నిచ్చి మహావైభవంగా వివాహంచేసి, కుజుంభుడి నగరాన్ని తన అల్లుడు కొల్లగొట్టి తెచ్చిన ధనాన్నంతా అతనికే ఇచ్చేశాడు.

సునంద అనే ముసలాన్ని నిర్వీర్య పరచినందుకు ముదావతికి సునంద అనే పేరు కూడా వచ్చింది.



# 52. బాద్షాహీ మసీదు

లాహోరులో ఉండే ఈ మసీదును ఇస్లాము మతాభిమాని ఔరంగజేబు పాదుషా 1674 లో కట్టించాడు. మహమ్మద్ ఇక్బల్ కవిని దీని ద్వారం వద్దనే సమాధి చేశారు.



# త్వరలో వెలువడనున్న
# అత్యుత్తమ సినీ మాసపత్రిక

# ?   ?   ?

కళాన్వితమైన ఈ తెలుగు పత్రికకు మీరు
చక్కని ఆకర్షవంతమైన పేరు సూచించండి.

## ఆమోదించబడిన సూచనకు
## బహుమానం 116 రూపాయలు

[మరియు ఒక సాలు చందా ఉచితం]

ఈ పోటీలో పాల్గొనదలచినవారు ఈ క్రింది కూపను నింపి మార్చి ఆఖరులోగా పోస్టు చెయ్యండి. ఒక్కొక్క కూపనులోనూ రెండు పేర్లు సూచించవచ్చును.

---

నూతన సినిమాపత్రిక నామకరణం

పేరు 1 ..............................

2 ..............................

పోటీదారు పేరు ..............................

చిరునామా ..............................

..............................

బాక్సు నెం. 3

C/o చందమామ పబ్లికేషన్స్

వడపళని, మదరాసు - 26.

---

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఇంతే సంగతులని వ్రాయండి

పంపినవారు:
జి. ఆర్. రాజు, నిండ్ర

Photo by Prabhakar Mahadik



బహుమతి
పొందిన వ్యాఖ్య

ముచ్చట్ల తర్వాత మేయండి

పంపినవారు :
జి. ఆర్. రాజు, నిండ్ర

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1966 మే నెల సంచికలో ప్రకటించబడును.




★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మార్చి నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఇంతే సంగతులని వ్రాయండి

రెండవ ఫోటో : ముచ్చట్ల తర్వాత మేయండి

పంపినవారు : జి. రామచంద్రరాజు,

నింద్ర, (చిత్తూరు జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at The B. N. K. Press Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

తలనొప్పి
ఎక్కువగా ఉన్నా
తలకేగా!

# అమృతాంజనం వాడి
## శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారించుకోడానికి ఊరికే మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పి ఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా కండరాల నొప్పులకు, తల నొప్పికి, బెణుకులకు ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృంతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకే కాక సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెంకొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతాకలిపి నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధిపొందిన నమ్మకమైన గృహౌషధం.




అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.

అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ





జవహర్ లాల్ నెహ్రూ
యిలా అన్నారు. "భావిలో సౌఖ్యానికి
విశ్రాంతికి తావులేదు. మనము ఎడతెగక
కష్టపడి పనిచేయాలి." కనుక
ఆయన ఆత్మకు శాంతి చేకూర్చడానికి ఎక్కువ పనిచేసి
జాతీయ సంపదకు ఎక్కువ ఉత్పత్తి చేర్దామని కంకణము కట్టుకొందాము.
జె. బి.
మంఘారామ్
& కంపెనీ
గ్వాలియర్ & హైదరాబాదు




OJB-136 TL

ఉగాది కానుక!











శ్రీ దేవి ప్రొడక్షన్స్ వారి....

# పరమానందయ్య శిష్యుల కధ



రచన: సదాశివబ్రహ్మం
సంగీతం: ఘంటసాల
కూర్పు: బి.గోపాలరావు
ఛాయ: సి.నాగేశ్వరరావు.

దర్శకత్వం: సి.పుల్లయ్య
నిర్మాత: తోట సుబ్బారావు

పూర్ణా రిలీజ్.

SREEKRISHNA PUBLICITIES.

వెండితెర నవల - ఒక రూపాయి
ప్రతులకు: అట్లూరి శరత్ బాబు, విజయవాడ - 4.

తీసుకోండి

# గెవార్ట్ గెవాబాక్స్

# 50% పెద్దవయిన ఆకర్షణీయమగు ఛాయా చిత్రములు

గెవా బాక్స్, అద్భుతమైన దీర్ఘ చతురస్రాకారపు చిత్రములు 6 సెం. మీ. అంత పెద్దవి...సాధారణ కెమేరాలు ఇచ్చే వాటి కంటే 50% పెద్ద వాటిని ఇచ్చును. మరియు నెగెటివ్స్ యొక్క సాటిలేని విశిష్టత వలన ఎంతో చక్కటి ఎన్‌లార్జ్‌మెంట్‌లు మీకు నిశ్చయంగా లభిస్తాయి !

ఈ విశేషమైన లక్షణముల వలన గెవా బాక్స్ సర్వోత్తమమైనది.

- ■ దృఢమైన, చక్కటి బోడీ-పూర్తిగా ఉత్కృష్టమైన స్టీల్‌తో తయారు చేయబడినది.
- ■ సరియైన కాంపోజిషన్, శీఘ్రంగా, సులభమైన ఫొటోగ్రాఫ్‌ల కొరకు, ఉజ్వలమైన, స్పష్టమగు, అయ్-లెవెల్ వ్యూ ఫైండర్.
- ■ 3 స్పీడ్స్ (బల్బ్, 1/50 వ మరియు 1/100 వ సెకండ్‌లు) ఖచ్చితమగు, ఫాస్ట్-ఏక్షన్ షాట్స్ తీసుకోండి.
- ■ దూరపు వస్తువులకు ఫోకస్ చేసుకునేందుకు (f 11 మరియు f 16) 2 ఎపర్చర్‌లు

గెవా బాక్స్‌ను వాడడం ఎంతో సులభం కూడా, ఒక సారి క్లిక్ చెయ్యండి – మీ గెవా బాక్స్ మిగిలినదంతా చేస్తుంది. మీ ఎపి ఎల్ వర్తకుని చూపించమని అడగండి. ఖరీదు: రూ. 44.00




# గెవార్ట్ గెవాబాక్స్




ఎల్లయిడ్ ఫొటోగ్రాఫిక్స్ లిమిటెడ్, కస్తూరి బిల్డింగ్, జమ్‌షెడ్జీ టాటా రోడ్, బొంబాయి.

Bensons/I-APL.1.TL



ఆహా ...కోలినోస్
స్వచ్ఛత లేక తాజాదనం కొరకు!



ఆహా ...కోలినోస్
చల్లని, తియ్యని రుచి కొరకు!



ఆహా ...కోలినోస్
సమృద్ధయిన నురగ కొరకు!



ఆహా ...కోలినోస్
శ్వాసలో తియ్యని సువాసన కొరకు!



ఆ ఐదో బాలునికి ఒక్క కిటుకు: కోలినోస్ వాడి ఒక్క చిరునవ్వు అందరిలాగే! ప్రతి రోజూ రాత్రి మరియు ఉదయము కోలినోస్ డెంటల్ క్రీమ్‌తో పళ్లను బ్రష్ చెయ్యాలి. స్నేహితుల సహవాసంలో అధిక విశ్వాసము...అధిక ఉల్లాసము!

స్వచ్ఛమైన పళ్లు! తాజాశ్వాస!

ఆహా ...కోలినోస్




Registered user: GEOFFREY MANNERS AND COMPANY LIMITED

## Statement about ownership of CHANDAMAMA (Telugu)
## Rule 8 (Form IV), Newspapers (Central) Rules, 1956

| | | |
|---|---|---|
| 1. *Place of Publication* | : | 'CHANDAMAMA BUILDINGS'<br>2 & 3, Arcot Road,<br>Vadapalani, Madras-26 |
| 2. *Periodicity of Publication* | : | MONTHLY<br>1st of each Calendar month |
| 3. *Printer's Name*<br>*Nationality*<br>*Address* | : | B. NAGI REDDI,<br>INDIAN<br>The B. N. K. Press (Pvt.) Ltd.,<br>2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 4. *Publisher's Name*<br>*Nationality*<br>*Address* | : | B. VISWANATHA REDDI,<br>INDIAN<br>Managing Partner, Sarada Binding Works,<br>2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 5. *Editor's Name*<br>*Nationality*<br>*Address* | : | CHAKRAPANI (A. V. Subba Rao)<br>INDIAN<br>2 & 3, Arcot Road, Vadapalani, Madras-26 |
| 6. *Name & Address of individuals who own the paper* | : | SARADA BINDING WORKS:<br>PARTNERS,<br>1. Sri B. Viswanatha Reddi,<br>2. Sri B. L. N. Prasad,<br>3. Sri B. Venugopal Reddi,<br>4. Sri. B. Venkatarama Reddi.<br>5. Smt. B. Seshamma,<br>6. Smt. B. Rajani Saraswathi,<br>7. Smt. A. Jayalakshmi,<br>8. Smt. K. Sarada, |

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**B. VISWANATHA REDDI,**
*Signature of the Publisher*

*1st March, 1966*

